# అభిప్రాయవేదిక

" శ్రీవాణి" పత్రిక మన పవిత్రమైన సనాతన ధర్మాన్ని, సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక, విద్యా విజ్ఞానములను అందించు పత్రికగా ప్రశంసల నందుకొను చున్నది. "

— శ్రీమతి యన్. ఆదిలక్ష్మి గుంటూరు

" శ్రీవాణి పత్రిక సాహిత్య, సాంస్కృతిక రంగ ముల పట్ల కనబరుస్తున్న ఆసక్తి, కృషి శ్లాఘనీయ మైనది. "

— పెరుమాళ్లి రఘునాథ్, ధవళేశ్వరం

" లాభ నష్టాలను లెక్క పెట్టకుండా, ప్రజాసేవయే పరమధ్యేయంగా, అత్యుత్తమ విలువలు గల సాహిత్య పత్రికను అసిధారావ్రతంగా నడుపుతున్న మిమ్మలను అభినందించకుండా ఉండలేక పోతున్నాను. శ్రీ బాబాగారి అండదండలు, ఆశీర్వాదబలమూ తమకున్నాయి, కాబట్టి శ్రీవాణికి వచ్చిన భయంలేదు. "

— ముదివేడు ప్రభాకరరావు
సహాయాంధ్ర పరిశోధకుడు
ఓరియంటల్ రీసెర్చ్ ఇనిస్టిట్యూట్
యస్. వి. యూనివర్సిటీ. తిరుపతి

"శ్రీవాణి పత్రిక మన సంస్కృతికి, సంప్రదాయానికి చేస్తున్న సేవ చాలా ఉన్నతమైనది. ఇటువంటి అవసరం ఈ రోజులలో ఎంతైనా ఉన్నది. దాన్ని యధోచితంగా తీర్చడానికి చేస్తున్న కృషి ఎంతో అభినందనీయం. "

— వేమూరి వెంకటేశ్వరశర్మ,
సికింద్రాబాద్

" ప్రారంభ సంచిక నుండి వ్యాపార పద్ధతికి దూరం గాను, సాహిత్యానికి అతి దగ్గరగాను పత్రికను నడుపు తున్నందుకు అభినందనలు. "ప్రాణమిచ్చేటునకమే మిన్న" (మార్చి '87) రచన చదివేక నా కనులు అశ్రుపూరితం లయ్యాయి."

— కె. . కృష్ణ, నాగార్జునసాగర్

" ప్రాణమిచ్చేటునకమే మిన్న అను వ్యాసం చదివి నప్పుడు నా కన్నుల వెంబడి నీరు కారింది. అనుమతిస్తే "జీవబంధు" పత్రికలో ముద్రిస్తాను."

— పీలా రామకృష్ణ, ఎడిటర్ "జీవబంధు"
గుంటూరు

" వ్యయ ప్రయాసల కోర్చి శ్రీవాణి పత్రికను ఉన్నత ప్రమాణాలతో వెలువరిస్తున్నందుకు అభినందిస్తున్నాను.

— జానమద్ది హనుమచ్ఛాస్త్రి, కడప

## మార్చి రంజనిమాల సమాధానములు

అడ్డము

3. సాటేలా నీకు
5. ముత్యాల పేరు
6. కొంటె
7. సరాగాలు
8. ఎంకి
11. నా రాజ
12. మాట కోటలు

నిలువు

1. ముసిముసులు
2. ముద్దుల నా యెంకి
3. సాగరుని సల్లాపమా
4 నీతోటె
8. ఎంకిరాణి
9. రేవెలుగులు
10. కొక్కోకో

ఏప్రియల్ - 1987

సంపుటి : 3

సంచిక : 4

సంపాదకుడు-కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-51 రామానాయుడుపేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818

విడి ప్రతి : రు. 3-00

సంవత్సర చందా : రు. 36-00

2 సం॥ల చందా : రు. 66-00

4 సం॥ల చందా : రు. 116-00

జీవిత సభ్యత్వం : రు. 500-00

Cheques & Drafts should be drawn in favour of SREEVANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at SPANDANA PRINTERS MACHILIPATNAM

## వి ష య సూ చి క



* ముఖచిత్రం *

ఛత్రపతి వీర శివాజీ

# ప్రశాంతి నిలయంలో... తొమ్మిది రోజులు

జీవితంలో కొన్ని సంఘటనలు ఊహించని రీతిలో జరుగుతూ ఉంటాయి. మరికొన్నింటిని ముందుగానే ఊహించగలుగుతాం. అప్పుడు నా ప్రతాపమేఅనుకుంటాడు మానవుడు. మంచిజరుగుతే సంతోషస్తాడు, విర్రవీగుతాడు. చెడుజరుగుతే తనను తాను నిందించు కుంటాడు, పరులను దూషిస్తాడు, దురదృష్టవంతుడనని భావిస్తాడు, చిట్టచివరికి భగవంతుని మీద కూడా నింద మోపడానికి ఏ మాత్రం వెరువడు. ఇది మానవ సహజ ప్రవృత్తి. ఈవిధంగా తరాలు తరలి పోతున్నాయి, యుగాలు దొరలి పోతున్నాయి గాని, అసలు యదార్థమేమిటో మానవుడు గుర్తించలేక పోతున్నాడు. అసలు విషయం తెలుసుకోవాలనే తాపత్రయం కూడా కనిపించడంలేదు.

నా జీవితంలో 30 సంవత్సరాలపాటు సుదీర్ఘ రాజకీయ ప్రయాణంచేసి, అనేక ఉద్యమాలలో పాల్గొని. ఎన్నికల రంగంలో పోరాడి, కారాగారవాసాన్ని సహితం చవిచూచిన నేను మరొక క్రొత్త మార్గంలో నడవడానికి కృతనిశ్చయుడనై ప్రశాంతి నిలయమునకు మార్చి 9వ తేదీన పయనమై వెళ్లాను. ఇది నిజంగా నా జీవితంలో ఊహించని ఒక క్రొత్త మలుపు. నా రాజకీయబంధాలను, అనుబంధాలను నిర్మోహమాటంగా త్రుంచివేసుకుని, ఎవరు ఎన్ని విధాల మాట్లాడినా, నిష్ఠూరంగా నిందించినా, వాటన్నింటినీ సహనంతో స్వీకరించి, నాలో చెలరేగిన వేదనను, ఆవేదనను అదిమిపెట్టుకొని, నాలో రగుల్కొంటున్న బడబాగ్ని జ్వాలలు కాకముందే, ఆత్మబంధువుకు మనసు విప్పి చెప్పుకొని, మనశ్శాంతిని పొందాలనే తాపత్రయంతో భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారి సన్నిధికి చేరుకున్నాను.

అది పదవతేది ఉదయం. భక్తి పారవశ్యంలో భక్తులు సంకీర్తన చేస్తున్న శుభసమయం అది. ఆ వరుసలలో కూర్చొని బాబా రాకకోసం నిరీక్షిస్తూ, మందిరంవైపుకు చూస్తున్నాను. ఒక దివ్యతేజస్సు మెరుపులా తటుక్కున మెరిసింది. ఇంతలో భగవాన్ ప్రత్యక్షమైనారు. అడుగులో అడుగు వేసుకుంటూ, భక్తుల ముఖాలను పరికిస్తూ, నిదానంగా నడుస్తూ నావద్దకు బాబాగారు వచ్చి "కృష్ణమోహన్‌రావ్? ఎప్పుడు వచ్చావ్ ?" అని పలకరించారు. అచేతనంగా సమాధానం చెప్పాను. చేయిఎత్తి దీవించి వెళ్లిపోయారు. అప్రయత్నంగా నాకనులవెంబడి కన్నీరు కారింది. తరువాత 12 వ తేది సాయంత్రం గం. 5-15 ని లకు నన్ను ఇంటర్‌వ్యూలో రమ్మనమని పిలిచినప్పుడు నాకు కలిగిన ఆనందం వర్ణనాతీతం. "ఏ పూర్వపుణ్యమో, ఏనాటి బంధమో" అనుకుంటూలేచి వెళ్లాను. ఆ ఇంటర్‌వ్యూ గదిలోనికి నాతోపాటు 19 మంది వివిధ రాష్ట్రములకు చెందినవారు విదేశీయులుకూడా వచ్చారు బాబా నావైపుకు కరుణతో, ప్రేమతో చూచినప్పుడు ఆనంద బాష్పాలు రాలాయి. "మంచిపనిచేసావ్, సమాజసేవ చేయడానికి అనేకమార్గాలున్నాయి. నేడు రాజకీయాలు ఎండుటాకులా గాలి ఎటువస్తే అటు పోతున్నాయి, కలుషితమైపోయినాయి. పూర్వం రాజకీయాలలో "రాజనీతి" ఉండేది. నేడు ఓటు కోసం నీతిని తాకట్టుపెడుతున్నారు. పూర్వం రాజకీయ నాయకులకు దేశాభిమానంఉండేది. అది రానురాను ప్రాంతీయాభిమానంగాను, గ్రామాభిమానంగాను, కులాభిమానంగానుమారుతూ, మారుతూ, చిట్టచివరికి దేహాభిమానంవరకు దిగజారారు." అని బాబాగారు అన్నప్పుడు నాలో కలిగిన ఆనందమును వర్ణించడానికి నామాటలుచాలవు. ఆ విధంగా ఒకఅరగంట సేపు వారి సాన్నిధ్యంలోవుండే సద్భాగ్యం నాకు కలిగింది. తరువాత మరొక గదిలోనికి నన్ను ప్రత్యేకంగా పిలిచారు. నాహృదయంలో చెలరేగుతున్న బడబాగ్ని కట్టలు త్రెంచుకుని బయటకు పరవళ్లు త్రొక్కుతూ వచ్చింది.

అపుకోలేకపోయాను. బాబాగారి పాదపద్మములమీదపడి బిగ్గరగా వెక్కి-వెక్కి ఏడ్చేశాను. బాబాగారు నాతల నిమిరి, నా చేతులు తీసుకొని వారి తొడమీద పెట్టుకొని నన్ను బుజ్జగించారు. "బాబా! ఇంతకాలానికి నాకు నా మనసులోని బాధను, వ్యథను మనసువిప్పి చెప్పుకొనే అవకాశం నేడు నాకు లభించినందుకు నేను ఎంతో సంతోషిస్తున్నాను ఒక ఆత్మబంధువు, ఒక దివ్య పురుషుడు, మానవరూపం దాల్చిన సాక్షాత్ భగవంతునికి నా ఆవేదనను విన్నవించు కొనే సదవకాశం నేడు నాకు లభ్యమైనందుకు ధన్యుడను బాబా! ధన్యుడను" అనిఏడ్చాను. బాబానన్ను సముదాయిస్తూ "నా అనుగ్రహం నీకున్నది, ఇప్పటివరకు నీ జీవితంలో అనేక మందిని చూచావ్ ఇప్పుడు ఈ సాయిప్రేమను చవిచూస్తున్నావు. సాయిప్రేమ సామాన్యమైనదికాదు. నమ్ముకున్నవారికి నిండుగా లభిస్తుంది. నీకేమీ ఫరవాలేదు. శ్రీవాణిని అందరూ మెచ్చుకుంటున్నారుగదా ! దానికి నా ఆశీస్సులున్నాయి. మనస్సును కేంద్రీకరించి మంచిగా నడుపు " అంటూ ఊహించనిరీతిలోనన్ను బుజ్జగించారు. ఆత్మవిశ్వాసాన్ని కలుగజేసారు. కళ్ళతుడుచుకొని బయటకు వచ్చాను. ఇంటర్వ్యూకు పిలిచిన భక్తులలో కర్నూలుకు చెందిన తండ్రి, కొడుకువున్నారు. అతను ఫ్లాష్ కెమెరాతో ఫోటోలు తీసుకున్నాడు బాబాగారి ప్రక్కన నుంచొని ఫోటో తీయించుకోవాలనుకొని కెమెరా కొడుకుకు యిచ్చి బాబాగారిని అనుమతికోరగా "ఫ్లాష్ లేదుగా!" అన్నారు బాబాగారు ఎంతనొక్కినా ఫ్లాష్ పని చేయలేదు రెండు నిముషాల తరువాత ' తీసుకో ' అని బాబాగారు అనగానే అప్పుడు ఫ్లాష్ పనిచేసింది. మేమెంతో ఆశ్చర్యపడ్డాం. బాబాగారు అక్కడి వారందరికి విభూతి ప్రసాదంపంచుతున్నారు. నేనూచేయిచాచాను. "ఇంకా నీవు కొంతకాలం యిక్కడ ఉండాలిగదా ! నేనిప్పుడు ప్రసాదం నీకు యివ్వను" అని నవ్వారు. ప్రసాదం పొందినవారు. వారి ఇండ్లకు వెళ్ళడానికి బాబా అనుమతి యిచ్చినట్లేనని అక్కడి పెద్దలు చెప్పారు.

ప్రశాంతి నిలయంలో అనేకమంది పెద్దలను కలిసాను. బాబాగారి విషయాలను తెలుసుకోవడం నా నిత్యకృత్యం. వేద నిష్ణాతులను కలిసాను, ఆధునిక విజ్ఞాన నిధులను కూడా కలిసాను. అనేక విషయాలను తెలుసుకున్నాను. అట్టివారిలో వేదశాస్త్ర విజ్ఞాన పారంగతులైన శ్రీ కుప్పా బైరాగిశాస్త్రి, శ్రీ చెరుకుమల్లి కామావధాని, ప్రశాంతి నిలయంలో భాగవత, భారత, రామాయణ పురాణములను భక్తులకు ప్రతినిత్యం వినిపిస్తున్న శ్రీ జంధ్యాల వెంకటేశ్వర శాస్త్రిగార్లను కలిసి అనేక సందేహాలను నివృత్తిచేసుకున్నాను. అంతేకాదు ఆధునిక విజ్ఞానంలో నిధులైన డా. యం యన్. రావుగారిని కలిసాను. వీరు అమెరికాలో పెద్దఉద్యోగంచేసి, గతమూడుసంవత్సరాలుగా ప్రశాంతి నిలయంలో. సత్ కాలక్షేపంచేస్తూ, బాబాగారిని అనేక కోణములనుండి పరిశీలించి, దేశవిదేశీ భక్తుల అనుభవాలను సేకరించిఒక మంచిపుస్తకమును ఇంగ్లీషులో రచించిన మేధావి ఈయన. అంతేకాదు. భారతదేశంలో వేదపండితులుగా పేరుప్రఖ్యాతులనందుకొని, ఈ మధ్యనే ప్రశాంతి నిలయంలో పరమపదించిన కీ.శే. శ్రీ గండికోట సుబ్రమణ్యశాస్త్రిగారి కుమారుడు డా.జి.వి.సుబ్బారావుగారిని కూడా కలిసాను. వీరు అమెరికాలో పెద్ద ఉద్యోగంచేస్తూ, దానిని వదలి బాబాగారి ఆదేశం మేరకు ప్రశాంతి నిలయంలో ఉంటూ తండ్రిగారి రచనలను అధ్యయనం చేస్తున్నారు. వీరుభయులనుండి అనేక అమూల్యమైన విషయాలను తెలుసుకోగలిగాను. పెద్దలను, అనుభవజ్ఞులను, భక్తులను కలుసుకోవడం, ఉదయం రెండు పర్యాయములు, సాయంత్రం రెండు పర్యాయములు బాబాగారి దర్శనంకోసం భక్తులవరుసలలో కూర్చోవడం నా నిత్యకృత్యమైంది. అమూల్యమైన విషయసేకరణ కోసమే బాబాగారు నన్ను ప్రశాంతినిలయంలో ఉంచారేమోనని నేను భావించాను ఏది ఏమైనప్పటికి కాలం మాత్రం వృథాచేయలేదు. ఉదయం, సాయంత్రం బాబాగారు నావద్దకు వచ్చి పలుకరించి-వెళ్ళిపోయేవారు.

అది 16 వ తేది. ఉదయం పది గంటలకు డా॥ యం. యన్. రావుగారిని కలిసి వారు వ్రాసిన

( తరువాయి 49వ పేజీలో )

శ్లో॥ సు జీర్ణ మన్నం సువిచక్షణః సుతః
సుశాసితా స్త్రీ నృపతిః సుసేవితః
సుచింత్య చోక్తం సువిచార్య యత్కృతం
సుదీర్ఘ కాలేఽపి నయాతి విక్రియాం ॥

మనం యేది మాట్లాడినా చక్కగా ఆలోచించి మాట్లాడాలి. అలాగే యే పని చేసినా బాగా ఆలోచించిన తర్వాతనే చేయాలి. బుద్ధితో చక్కగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చి తూచినట్లు మాట్లాడిన మాటకూ, మంచి చెడులు లోతుగా విచారించి దోషరహితంగా చేసిన పనికీ మంచి విలువ, మంచి ఫలితం కలుగుతుంది. ఎంతకాలం గడిచినా అలాంటి మాటకు గాని, అలాంటి పనికి గాని మార్పు రాదు. వికారం కలగదు.

# అమృతవాణి

కూచిభట్ల చంద్రశేఖరశర్మ

ఏ మనిషైనా తాను మాట్లాడేటప్పుడు కొంచెం ముందు వెనుకలు గమనిస్తూ మాట్లాడాలి. అలాగే పనిచేసే ముందు చేయవచ్చా! చేయకూడదా ! అని కాస్త ఆగి బుద్ధితో ఆలోచించి చేయాలి. అలాకాకపోతే దుష్ఫలితాలు సంభవిస్తాయి. మాటజారితే ముప్పు. చేసిన పని దిద్దుకోటం కష్టం.

ఆలోచించి చేసిన పని పలికిన పలుకు ఎప్పుడూ ఒకే రకంగానే వుంటాయి. వికారం వుండదు. ఎలాగంటారా? చూడండి.

మనం తిన్న ఆహారం అరిగిపోయిందనుకోండి. దానివల్ల శరీరానికి బలం కలుగుతుంది. ఒకవేళ అరగకపోతే దానివల్ల రోగాలు వస్తాయి. కనుక జీర్ణమైన అన్నం మేలు చేస్తుంది. అదేవిధంగా కడుపున బుట్టిన కొడుకు చక్కగా చదువుకొని జ్ఞానవంతుడయ్యాడనుకోండి వాడివల్ల తలిదండ్రులకు సుఖమేకాని దుఃఖం కలగదు. కనుక కొడుకు వివేకి అయితే లాభం అదన్నమాట. అలాకాకపోతే కలిగే బాధలు యెన్నో చెప్పలేం.

ఇలాగే స్త్రీకూడా మంచిక్రమశిక్షణలో సంప్రదాయంలో పెరిగితే వచ్చేలాభం వంశానికి వచ్చే గౌరవం చాలా గొప్పది. ఇంగితజ్ఞురాలయిన స్త్రీవల్ల కుటుంబ గౌరవ మర్యాదలు పెరుగుతాయి. అలాకాక స్వేచ్ఛగా తిరిగినట్లయితే ఆ స్త్రీకీ, ఆమెవల్ల వంశానికీ, కళంకమేర్పడుతుంది. కనుక సుశిక్షితురాలయిన స్త్రీవల్ల ఉభయ వంశాల గౌరవం పెరుగుతుంది. ఇల్లాలికి అంత ప్రాధాన్యముంది! ఇదేవిధంగా ఆలోచిస్తే విశ్వాసపాత్రుడై సేవకుడు రాజును సేవిస్తే కూడా వచ్చే సత్ఫలితం యిలాంటిదే అవుతుంది. రాజే కానక్కర్లేదనుకోండి, గురువు లేక భగవంతుడు అనుకుందాం. నిర్మలమైన మనస్సుతో భక్తితో రక్తితో సేవిస్తేగురువుకైనా భగవంతునికైనా కలిగేఅనుగ్రహంలో యెలాంటిమార్పు వుండదు. సేవించేవాణ్ణి బట్టే వుంటుంది యేదైనా ?

ఇంతకూ దీని సారాంశమేమిటంటే – ఆలోచించి పలికేమాట, చక్కగా విచారించి చేసేకార్యం రెండూకూడా చక్కగా జీర్ణమైన అన్నంలాగనూ, వివేకవంతుడైన కుమారుడు లాగానూ, అదుపులో పెరిగిన స్త్రీలాగాను, చక్కగా సేవింపబడే రాజుమాదిరిగాను సత్ఫలితాలనే యిస్తాయి. ఎన్నటికీ వికారమనేది అంటే మార్పు అనేది వుండదు. ఎంతకాలమున్నా వీటివల్ల మంచి జరుగుతుందే కాని చెడు జరగదు అని భావం. 

# పతివ్రతా శిరోమణి సీతాదేవి

" ఏ దేశ వాఙ్మయమునందైనను శ్రీరామ చంద్రుని వంటి పురుషోత్తములు లభించిన లభించ వచ్చునేమో గాని, సీత వంటి యాదర్శ చరిత్ర గల పతివ్రతా తిలకము లభించుట దుర్లభము "

అని స్వామి వివేకానంద అభిప్రాయ పడడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. వాల్మీకి మహర్షి సహితం శ్రీమద్రామాయణ మహాకావ్యమునకు—

" సీతాయాశ్చరితమ్ "

అని పేరుకూడా పెట్టినారు. సీతాదేవి ఒక్క భారతదేశమునకే గాక యావత్ ప్రపంచంలోని నారీ లోకానికి ఆదర్శప్రాయమైనది. ఆదర్శ స్త్రీలో ఉండవలసిన సత్ప్రవర్తన, మంచినడత, సుగుణశీల సంపత్తులు ఏ విధంగా వుండాలో, తన జీవన గమనం ద్వారా చూపించి, ఆచరించి, విరాజిల్లిన పరమ సాధ్వీమణి, సౌశీల్యవతి, పతివ్రతా శిరోమణి " సీతాదేవి ".

## సతిధర్మం

శ్రీరామచంద్రుడు తండ్రి ఆజ్ఞానుసారము అరణ్యవాసమునకు పోవునను వార్తను విని, తనను కూడా తీసుకొని వెళ్ళమని ప్రతిమాలుకుంటుంది. భర్తను అనుసరించడమే భార్యగా తన ధర్మమని వాదిస్తుంది. శ్రీరాముడు మొదట్లో అంగీకరించడు అయోధ్యలోనే వుండి అత్తమామలకు సేవచేస్తూ వుండమని కోరుతాడు. సీతాదేవికి కోపం వస్తుంది. భర్తలేని స్వర్గసుఖముల కంటే, భర్తతో అరణ్యవాస దుఃఖమే మేలు. నీతో కలసి వుండటమే స్వర్గం. అదియే నాకు పరమసుఖం. నిన్ను విడిచి వుండుటయే నాకు నరకం. రాముడు అడవికి వెళ్ళాలన్న ఆజ్ఞ భార్యగా నాకు కూడా వర్తిస్తుంది ఐశ్వర్యములుగాని, ధనముగాని నన్ను లోభపెట్టజాలవు. రాజ్యసుఖములను కోరను. నావల్ల మీకు ఎలాంటి యిబ్బందులూ కలుగవు. కాయలు, దుంపలు, పండ్లు తింటూ, ఆనందంతో మీతోనే వనవాసాన్ని గడుపుతాను. పతిసేవ చేయడం సతి ధర్మం. అడవిలో మీ ముందు నడుస్తూ ముళ్ళు, దర్భలు పెరికివేస్తూ దారిని శుభ్రం చేస్తుంటాను. మొండి పట్టు పడుతున్నానని కోప్పడకండి! భర్తను అనుసరించడమే భార్య ధర్మం కదా! నాపై దయవుంచి నన్ను వనవాసమునకు తీసుకొని వెళ్ళండి " అని ప్రాధేయపడుతుంది. లేనియెడల విషము త్రాగియో, నీటిలోపడియో, అగ్నిలో దూకియో మరణిస్తానని బెదరిస్తుంది. పతివ్రతా ధర్మమును ఎరుకపరుస్తుంది.

**కొమరగిరి కృష్ణమోహనరావు**

## భారత స్త్రీ

గత్యంతరం లేక శ్రీరాముడు అంగీకరిస్తాడు. చిరునవ్వుతో సంతోషంగా రథం ఎక్కుతుంది. ఒక్క సుఖంలోనే గాక, కష్టములలో కూడా పాలుపంచుకోవడం నిజమైన భారత నారీధర్మమని నిరూపించింది సీతాదేవి. దీనిని బట్టి సీతయొక్క నిర్మలమైన ప్రేమ, పతిభక్తి పరాయణత్వము స్పష్టంగా బోధపడుతున్నది. భారత స్త్రీ కోరుకొనేది మేడలు, మిద్దెలు, భవనాలు, భోగాలు, సుఖాలు కావని, భర్తయొక్క ప్రేమానురాగాలు మాత్రమేనని, భర్తను సేవించడమంటే, భగవంతుని సేవించడమేనని భర్త సన్నిధిలో జీవితాన్ని గడపడం ఒక్కటే భారత స్త్రీ యొక్క పరమోత్కృష్టమైన ధర్మమని ప్రపంచానికి చాటిన భారత స్త్రీ రత్నం " సీతాదేవి. " భారత స్త్రీకి ధర్మం, భర్త – ఈ రెండే శరణ్యమని నిరూపించింది.

## త్యాగమూర్తి

సీతాదేవి యెంతటి పతివ్రతయో, అంతటి త్యాగమూర్తికూడాను. ఆమె పతికొఱకు తన ప్రాణములనైననూ సంతోషంగా త్యజించ గలదని నిరూపించింది. ఆమె జీవితం త్యాగమయం. "విరాధుడు" అను రాక్షసుడు రామలక్ష్మణులను తన భుజస్కందములపై నిడుకొని పారిపోతున్న సన్నివేశమును కళ్లారాచూసి పెద్దగా రోదన చేస్తూ-

"మాం హరోత్సృజ కాకుత్స్థౌ నమస్తే రాక్షసోత్తమ" —

అంటూ తనను భక్షించి రామలక్ష్మణులను వదలివేయమని విరాధుని ప్రార్థిస్తుంది. తన పతి కొఱకు తన జీవితాన్ని సహితం సంతోషంగా సమర్పించుకోవడానికి ఏమాత్రం వెనుకంజ వేయలేదనే విషయం ఈ సంఘటన ఋజువు చేస్తున్నది. త్యాగమయమైన సీతాదేవి ఆదర్శ జీవితాన్ని స్త్రీ జాతి ఆదర్శముగా గైకొనిన యెడల కుటుంబాలలో కలతలకు ఏమాత్రం అవకాశం వుండదేమో!

## సమయస్ఫూర్తి

సీతను రావణుడు బలాత్కారంగా అపహరించి తీసుకొని పోతున్నప్పుడు విలపిస్తూ కూడా సమయస్ఫూర్తితో ప్రవర్తిస్తుంది. సహజంగా కష్ట కాలంలో బుద్ధి పని చేయదు. సమయస్ఫూర్తితో ప్రవర్తించడం బహు కష్టం. అప్పుడు ఈర్ష్య ద్వేషాలు మాత్రం మనస్సును ఆవరించి, సముచితమైన నిర్ణయాలను గైకొనడానికి అవసరమైన ఆలోచనలు రానేరావు. కర్తవ్యమేమిటో బోధపడదు. ఏమి చేయాలో తోచదు. విచారంతో కుమిలి కృశించి పోవడం జరుగుతుంటుంది. పైపెచ్చు కోపం ఎక్కువౌతుంది. విజ్ఞతను కోల్పోవడం జరుగుతుంది. కష్టాలను తట్టుకోలేక చిట్టచివరకి భగవంతుణ్ణి కూడా దూషించడం జరుగుతుంది. ఆత్మీయులను సహితం అపార్థం చేసుకుంటాం. దానితో బుద్ధి వేడెక్కుతుంది. సహనం కోల్పోయి ఇష్టం వచ్చినట్లుగా మాట్లాడుతాం. చివరికి పిచ్చివాళ్లమవుతాం - ఇవన్నీ సామాన్యుల లక్షణాలు. సీతాదేవి మాత్రం దీనికి అతీతంగా ప్రవర్తిస్తుంది. అటువంటి కష్టదశలో కూడా సమయస్ఫూర్తిని ప్రదర్శిస్తుంది. తన నగలన్నింటిని ఒక మూటగా కట్టి ఋష్యమూక పర్వతముపై పడవేస్తూ -

"భవిష్యతి కించిదనేన ప్రయోజనమ్"

దీనివలన ఏదో ఒక ప్రయోజనం భవిష్యత్తులో వుంటుందని భావిస్తుంది. ఈ సంఘటవలో సీత సమయస్ఫూర్తి ఎటువంటిదో నిరూపణ అయింది. ఆ నగల మూలముననే భవిష్యత్తులో సీత సమాచారమును శ్రీరామచంద్రుడు తెలుసుకోగలుగుతాడు. కష్టములలో కూడ సహనమును కోల్పోక, సమయస్ఫూర్తితో వ్యవహరించినప్పుడు మాత్రమే విజయమును సాధించగలుగుతామనే విషయం ప్రతి ఒక్కరూ గ్రహించాలి.

## వ్యక్తిత్వం

అశోక వనంలో రాక్షసస్త్రీల మధ్య బందీగా వున్నప్పుడు సీత వ్యక్తిత్వం ప్రస్ఫుటంగా కనపడుతుంది. రాక్షసస్త్రీల మాయాజాలాలకు, రావణుని బెదిరింపులకు ఏమాత్రం భయపడక, లొంగక 12 నెలలపాటు వంటరిగా, ఆహార నిద్రాదులను సహితం విడనాడి నిర్భయంగా జీవితాన్ని గడుపుతుంది. యమయాతనలను అనుభవించినప్పటికీ, లోభాలకు లొంగకుండా తన శీలాన్ని కాపాడుకుంది. మానవునియొక్క వ్యక్తిత్వం కష్టములయందే కనిపిస్తుంది. అప్పుడే వికసిస్తుంది. ప్రచండ దుఃఖంలోనే మానవుడు తన అస్తిత్వాన్ని గుర్తిస్తాడు. సాధారణ వ్యక్తులు, మహాత్ముల మధ్య ఈ తేడా విస్పష్టంగా కనిపిస్తుంది. సాధారణ వ్యక్తులు దైవానుగ్రహం వలన పరిస్థితులు అనుకూలిస్తే ఉన్నత స్థితిని పొందకలుగుతారు. కాని విషమ పరిస్థితులలో మాత్రం లక్ష్యభ్రష్టులగుదురు. 'మహాత్ములు మాత్రం భయపడక, కంగారు పడక, ఆత్మస్థైర్యమును కోల్పోక, ధైర్యంతో, ఆత్మవిశ్వాసంతో పరిస్థితులను ఎదుర్కొంటూ లక్ష్యమును

సాధించగలుగుతారు. ఎన్ని కష్టములెదురైనప్పటికి తమ విద్యుక్త ధర్మమును విడనాడరు. పిరికివాళ్లలా విడిచి పెట్టి పారిపోరు. వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుంటారు. సీతాదేవి కూడా తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుంది. అవ హేళన చేస్తున్న రాక్షసస్త్రీలకు ధైర్యంగా చక్కటి సమాధానం చెప్పిన ఘనత సీతాదేవికే దక్కింది.

" దీనోవా రాజ్యహీనోవా,
యోమే భర్తా సమే గురుః
తం నిత్య మనురక్తాస్మి.
యథా సూర్యం సువర్చలా "

" దీనుడుగాని లేక రాజ్యహీనుడుగాని నా భర్తయే నాకు పూజ్యుడు. సూర్యునియందు సువర్చలవలె నేనతనియందు నిత్యానురక్తయై యుందును. " అని సీతాదేవి తన భర్తను గురించి ధైర్యంగా, సగర్వంగా రాక్షసస్త్రీలకు చెప్ప గలిగింది. నా అనే వాళ్లు దరిదాపులలో ఒక్కరు కూడా లేక పోయినప్పటికీ. అంతధైర్యంగా సమాధానం చెప్ప గలగడం సామాన్యమైన విషయంకాదు. ఆమె యొక్క సౌశీల్యబలం, నైతిక శక్తులు మాత్రమే ఆమె చేత ఆ విధంగా పలికించాయి. శీలవృత్త సంపన్నులు మాత్రమే అటువంటి ధైర్యం చేయగలుగుతారు. దుష్టులకు ఏ మాత్రం తలవంచరు. సౌశీల్యశక్తికి అంతటి మహత్తర శక్తి వున్నదని సీతాదేవి నిరూపించింది.

## పాతివ్రత్య మహిమ

- సీతాదేవి పాతివ్రత్య మహిమను రావణుని భార్య మండోదరి సహితం గుర్తించింది, ప్రశంసించింది. రావణ వధానంతరం మండోదరి తన భర్త మృతశరీరంపై పడి విలపిస్తూ —

'పతివ్రతా యాస్తపసానూనం దగ్ధోఽసిమేప్రభో!' నీవు పతివ్రత యగు సీతాదేవి యొక్క తేజముచేతనే దగ్ధ మైవావని విలపిస్తుంది. సీతాదేవి యొక్క శీలసంపదలను గురించి రాక్షస స్త్రీలు సహితం కొనియాడటం విశేషం. మిత్రుడు తన స్నేహితుని గొప్పతనాన్ని గురించి పొగ డటం సహజం. అతనిలోని ఉత్తమ లక్షణాలను గురించి ప్రచారం చేయడం స్వాభావికం. శత్రువులు పొగడటం లోనే ఉన్నది ప్రత్యేకత. ఇక్కడ అదే జరిగింది. సీతాదేవి యొక్క ఉత్తమ శీల స్వభావాదులు శత్రువుల చేత ప్రశంసించబడ్డాయి. దీనిని బట్టి సీతాదేవి యొక్క పాతివ్రత్య మహిమ, శీల సంపత్తి ఎంతటిదో అవగత మవుతున్నది.

## ఆత్మబలం, నైతికశక్తి

సహజంగా మానవుడు కష్టాలలో చిక్కుకొనినప్పుడు ధైర్యమును విడనాడి దైన్యమును పొందును. నిస్సహాయ స్థితిలో వున్నప్పుడు నైతిక స్థాయి దిగజారును. ఏకాకిగా కాలం గడుపవలసి వచ్చినప్పుడు శీలభ్రష్టులగుదురు. అవాంతర పరిస్థితులు వచ్చి పైనబడినప్పుడు తట్టుకోలేక ఆత్మహత్యకు వడికట్టుదురు. వీటన్నింటిని సీతాదేవి ఏక కాలంలో ఎదుర్కొనినప్పటికి ఏమాత్రం చలించలేదు. ఎటు చూచినా నూరు యోజనాల సముద్రం. నా అన్న వారెవరూ సమీపాన లేరు. కళ్లు తెరిస్తే కనిపించేది వికృతాకారంగల రాక్షసస్త్రీలు. వినిపించేవి రావణుని బెదిరింపులు. అటువంటి భీకర, భయంకర వాతావరణంలో ఏకాకిగా వుండి కూడా, ఏమాత్రం చలించక, ఆత్మవిశ్వా సమును కోల్పోక, ధైర్యమును విడనాడక, పరిస్థితుల ప్రభావమునకు లొంగక, రావణుని అష్ట ఐశ్వర్యములకు మోహపడక, తన పాతివ్రత్యమును కాపాడుకుంది 'సీతాదేవి.' అంతేకాదు భారతస్త్రీకి 'పాతివ్రత్యము' అనునది ఒక మహత్తరమగు తపమని, అట్టి తపోనిష్ఠ రాంద్రగు స్త్రీలను వంచించువారు యెంతటి బలపరాక్రమ సంపన్నులైనను, అగ్నిలో పడిన మిడతలవలె దగ్ధమై పోవుదురని, సీతాదేవి తన ప్రవర్తనద్వారా ఋజువు చేసింది. ఎన్ని కష్టములొచ్చినను వాటిని లెక్కచేయక, ధైర్యంతో ఎదిరించి పోరాడగల ఆత్మబలం, నైతికశక్తి భారతస్త్రీలకు కలదని సీతాదేవి నిరూపించింది. సౌశీల్య మనే మహాశక్తిని కలిగివున్నవారు భౌతికశక్తికి తలవంచ నవసరంలేదని సీతాదేవి ప్రపంచానికి చాటింది. భావి కాలాలవారికి మహత్తర ఆదర్శమును, స్ఫూర్తిని, శక్తిని ప్రసాదించిన సౌశీల్యవతి 'సీతాదేవి' భారతనారీ గౌరవ ప్రతిష్ఠలను ఇనుమడింపజేసింది. అందుకే ఆమె సచ్చరిత్ర సకల నారీలోకానికి గర్వకారణమైనది. ఆమెను ఆదర్శంగా గైకొని ముందుకు సాగిపోవడం ప్రతిస్త్రీ కర్తవ్యం.






# కామ, క్రోధ, లోభములే సాధకునికి పరమశత్రువులు

**శ్రీ సత్యసాయి బాబా**

వేదవేదాంగములు వల్లె వేసియున్న
పద్య గద్యంబులను కూర్ప గలిగియున్న
చిత్తశుద్ధియు లేకున్న జడుడు వాడు
సత్యమును తెలుపు బాట ! ఈ సాయి బాట !

ఎంతటి తెలివి తేటలు గలవాడైననూ, ఎంతటి విద్యావంతుడైననూ అంతఃకరణ పరిశుద్ధియే లేకుండిన ఆత్మానందమును అనుభవించలేడు. ఆనందమన్నది కేవలం మనం క్రొత్తగా సంపాదించుకొనేటటువంటిది కాదు. ఆనందం మానవుని యొక్క స్వరూపం — తన స్వస్వరూపాన్ని తాను పొందటమే మానవుని ప్రధాన కర్తవ్యం. అయితే ఈ ఆనందమును పొందుటకు మానవుడు అనేక తాపత్రయములను పడుతున్నాడు. ఇంద్రియ సంబంధమైన క్షణిక భౌతిక సుఖములను అనుభవిస్తూ, దానినే నిత్యానందం, సత్యానందం అని భావించి కేవలం ప్రతిబింబానంద నిమిత్తమై ప్రాకులాడుచున్నాడు. కానీ ఈ ప్రతిబింబానందం, నిత్యానందం గాని, ఆత్మానందంగాని కానేరదు. అక్షయానందం, అద్వైతానందం, అతీతానందమైన బ్రహ్మానందమునే మానవుడు నిజముగా అనుభవించాలి. ఈ భౌతికానందమును అనుభవించడం వలన కోరికలు పెరుగునే గాని తరగవు. ఇలాంటి క్షణికానందం కోసం మానవుడు అనేక త్యాగాలకు సహితం పూనుకుంటున్నాడు.

## ఆత్మ తత్వము

మానవుడనగా కేవలం మనసుకు ఆవల వున్నటువంటి 'ఆత్మ'. ఈ ఆత్మ తత్వాన్ని తాను గుర్తించుకొన్నపుడు మనసుకు ఇవతల నున్న దేహమును ఏ మాత్రం విశ్వసించడు. మనసుకు ఈవల శరీరం, ఆవల ఆత్మ. ఆత్మ తత్వం నిత్యమైనటువంటిది, అమృతమైనటువంటిది.

చావు పుట్టుక లేనట్టి శాశ్వతుండు
ఆది మధ్యాంత రహితు డనాదివాడు
తాను చావక పుట్టక చంపబడక
అన్నిటను ఆత్మరూపుడై అమరుచుండు.

ఇట్టి నిత్యసత్యమైనటువంటి అమృత తత్వమును ఆనందింప జేసేటటువంటిదే ఆత్మ తత్వము.

## ఆత్మానందం

ఇంక దేహమా ? "మలినపు కొంప ; రోగముల క్రమ్మగెడి సేవక గంప ; జాతి తన చలనమును పొందు దుంప ; భవసాగర మీదగలేని కంప ; అమ్ముల పదిలంబు మెప్పు దలంప" - అదీ ఈ మేను. ఇట్టి అనిత్యమూ, అశాశ్వతమూ, అసత్యమూ అయినటువంటి, నీటి బుడగ వంటి దేహమును మనం విశ్వసించి, నిత్యసత్య నిర్మలమైనటువంటి ఆత్మతత్వమును విస్మరిస్తున్నాం. ఈ కారణము చేతనే మనం ఆత్మానందమునకు అతి దూరమై పోతున్నాం. మానవుడు రాగ ద్వేషములను దూరం గావించుకొని, అహంకారమును నిర్మూలనం జేసి, నిస్వార్థమైనటువంటి కర్తవ్య కర్మల నాచరించినప్పుడే ఆత్మానందమును అనుభవించగలడు. మానవుడు నిజంగా ఆనంద

స్వరూపుడు. ఆ ఆనందం తనయందే వున్నది. తాను అనంత స్వరూపుడై ఆనందమయుడై వుంటున్నప్పటికినీ, అల్పమైనటువంటి దేహమునే తానని భ్రమించుట చేతనే తాను ఈ ఆనందమును కోల్పోతున్నాడు. మానవత్వమనేటటువంటి దివ్యత్వాన్ని గుర్తించి వర్తించడమే మానవుని ప్రధాన కర్తవ్యం.

## దైవాంశం

మానవుడనగా కేవలం ఈ పాంచ భౌతిక దేహమును ధరించినటువంటివాడు కాదు. దైవాంశమే మానవుడు. కనుక మానవ జీవితగమ్యం దైవమును చేరడమేగాని, చావటం కాదు. కనుక సముద్రమునకు అంశం నది. ఈ నది సముద్రమును చేరినప్పుడే ఆనందం. నదికి అంశమే చేప. జలమును వదలి ఒక్క క్షణమైనా జీవించలేదు చేప. తల్లికి అంశం బిడ్డ. తల్లిని వదలి జీవించగలదా బిడ్డ ? చెట్టుకు కొమ్మ అంశం. చెట్టును విడచి కొమ్మ బ్రతకలేదు. దైవాంశమే మానవుడు. మానవుడు దైవమును విడచి వుండలేడు, బ్రతకలేడు. కనుకనే దైవమును చేరే నిమిత్తమై ఈ మానవత్వం ప్రాప్తించిందనే సత్యాన్ని మనం గుర్తించడం అత్యవసరం.

" మమైవాంశే జీవలోకే జీవభూతస్సనాతనః "

నా యంశమే సర్వులయందూ ఉన్నదనేటటువంటి సత్యాన్ని భగవద్గీత బోధిస్తున్నది.

" అహం ఆత్మా గుడాకేశ "

" నేను సర్వ జీవులయందు గూడను ఆత్మస్వరూపుడనై వున్నానని కృష్ణుడు బోధించాడు. పశువువలె ప్రకృతికి బానిసయై జీవించడానికి కాదు మానవుడు జన్మించింది. ప్రకృతికి ప్రభువై తాను జీవించాలి. నరుడు నారాయణత్వాన్ని అనుభవించాలి. కనుకనే ప్రతి మానవుడు

" శివోఽహం, శివోఽహం, అచ్యుతానందోఽహం
ఆనందోఽహం "

అనే తత్వాన్ని మనం అనుభవించాలి. కనుక ఈ మూల సత్యాన్ని గుర్తించి, కాలసర్పం కాటువేయకమునుపే, జీవిత నౌక మునిగిపోకమునుపే ఆత్మానందాన్ని మనం అనుభవించుటకు ప్రయత్నించాలి.

## మోక్షం

మోక్షం ! మోక్షం అనేటటువంటిది ప్రత్యేకమైన స్థానం కాదు. తన స్వరూపమును తాను గుర్తించుకోవడమే మోక్షం. తన స్వస్వరూపాన్ని తాను సందర్శించడమే మోక్షం. తనను తాను గుర్తించుకోవడమే మోక్షం. ఇలాంటి సత్యానికి మనం అతి దూరమై, అసత్యానికి సమీపమై, అశాంతిని అనుభవించడానికి ప్రయత్నిస్తున్నాం.

## ఆనందం ఎక్కడ ?

సర్వత్రా ఉన్నదటువంటిది ఆనందమే. మనం నివసించునది ఆనందమే. మన జీవితమే ఆనందం. కాని మమకార అభిమానములచేత మనం కప్పబడి, ఈ ఆవరణము చేతనే అశాంతిని అనుభవిస్తున్నాం. మనల్ని ఆవరించినటువంటి ఈ ఆవరణమును ఏనాడు తొలగించుకొందుమో, ఆనాడే సత్య స్వరూపాన్ని గుర్తించడానికి వీలవుతుంది. రాత్రి మనం గాఢ నిద్రను అనుభవించాం. ఈ కాళరాత్రి లోపలి ఆనందాన్ని అనుభవించాలి. నిద్రలో మనం ఏ వస్తువును అనుభవించలేదు. ఏ వస్తువునూ మనం అందుకోలేదు. ఏ వస్తువునూ మనం చూడలేదు. కానీ ఈ ఆనందం ఎక్కడనుంచి వచ్చింది ? ఇది బయటనుంచి ప్రవేశించినటువంటిది కాదు. తన యందున్నటువంటి ఆ ఆనందమునే, అన్ని విధములైనటువంటి ఆవరణాన్ని ఛేదించడం చేతనే ఆనందాన్ని అనుభవిస్తున్నాడు మానవుడు.

## దృక్, దృశ్యం

ఇక్కడ రెండు తత్వములున్నాయి. 1. దృక్ 2. దృశ్యం " దృక్ " అనేటటువంటిది సాక్షీభూతమైన ఆత్మతత్వం. " దృశ్యం " రూప నామములతో కూడిన ఈ ప్రకృతి తత్వం. దృక్ చైతన్యం. దృశ్యం జడం. ఈ జడచైతన్యముల రెంటినీ వేరు వేరుగా భావించడమే మానవుని ప్రధాన కర్తవ్యం. ఈ విభాగాన్ని అనుభవించే

వాడే సరైన సాధకుడు. ఈ రెండింటినీ చేర్చడం చేతనే మానవుడు దుఃఖమునకు గురి అవుతున్నాడు. కనుక దృక్, దృశ్యముల భేదమును గుర్తించి వీటిని వేరు గావించడమే మానవుడి ప్రధానమైన పని.

## దుఃఖం, క్షణికం

క్షణభంగురమైన ఇంద్రియ సుఖములకు లోబడి, ఎంతో దుఃఖమును మనం అనుభవిస్తున్నాం. ఇందులో శాశ్వతమైన ఆనందం గాని, శాశ్వతమైన సుఖము గాని లేదు. "అనిత్యం అసుఖం లోకం" కనుకనే బుద్ధుడు "సర్వం దుఃఖం ... దుఃఖం ; సర్వం క్షణికం ... క్షణికం" అన్నాడు.

ఈ సత్యాన్ని గ్రహించిన ఆనాటి మహారాజులు సర్వ సౌఖ్యములనూ విడనాడి సర్వసంగపరిత్యాగులై, పరాత్ముని యొక్క ఆనందాన్ని అనుభవించు నిమిత్తమై అడవులకు పయనమై వెళ్లారు. ధ్యానమే నిజమైన యోగ బలమని వారు విశ్వసించారు.

## మూడు ఆకాశములు

మూడు రకములైన ఆకాశములున్నాయి. 1. భూతాకాశము. 2. చిత్తాకాశము. 3. చిదాకాశము. భూతాకాశమనగా మనకు కంటికి కనిపించేటటువంటి భూమండమంతయూ అనగా అడవులు, చెట్లు, కొండలూ, నదులు అన్నీ వస్తాయి. దీని నిడివి 8 వేల మైళ్లు. ఇది కాక సూర్యమండలం ఉన్నది. దాని నిడివి 8 లక్షలమైళ్లు. ఇది భూమికంటే చాలా పెద్దది. సూర్యమండలం కంటే పెద్దవి నక్షత్రాలు, ఇవి కోట్లమైళ్ళ దూరంలో ఉన్నాయి. కొన్ని నక్షత్రముల యొక్క కాంతి క్షణమునకు ఒక లక్ష ఆరువేలమైళ్ళ దూరం పోతున్నది. ఇంకా కొన్ని నక్షత్రముల కాంతి ఈనాటికీ భూమికి చేరుకోలేదట. ఈ నక్షత్రములు, సూర్యుడు, చంద్రుడు, భూమి - అన్నీ చేరినటువంటిదే "భూతాకాశము" - అంటారు. ఇది చిత్తాకాశములో ఇమిడి వుంటున్నది. చిత్తాకాశమనగా ఏమిటి ? మనం సందర్శించిన అంశములన్ని మన చిత్తంలో అణుమాత్రంగా నిలిచిపోతున్నాయి. ఈ భూతాకాశమంతయూ, ఈ చిత్తాకాశంలో ఒక చిన్న రూపంగా నిలిచిపోతున్నది. అదే మానసిక తత్త్వం. ఈ మన సత్త్వంలో కూడను చిదాకాశమనేటువంటిది చాలా మరింతగా చిన్నదిగా నిలిచిపోతున్నది. ఈ చిదాకాశమే ఆత్మ స్వరూపం. ఈ ఆత్మయందే భూతాకాశము, చిత్రాకాశము ఇమిడి ఉన్నాయి. అనగా సమస్త బ్రహ్మాండమంతయూ ఈ ఆత్మ తత్వమునందు ఇమిడి ఉండడంచేతనే ఆత్మయే సర్వస్వమని గుర్తించడానికి వీలవుతున్నది. ఇట్టి ఆత్మానందాన్ని అనుభవించడం మన ప్రధాన కర్తవ్యం. నిజంగా మనం ఆనందమయములైనప్పటికినీ, ఆనందాన్ని ప్రపంచంలో వెదకడానికి ప్రయత్నిస్తున్నాం. మన దృష్టిని అంతఃర్ముఖం గావించుకోవాలి. మన దృష్టి బహిఃర్ముఖములో తిరుగుచున్నంతకాలమున్నూ మనకీ ఆత్మానందం అర్థం కాదు. కస్తూరిమృగం తన మెడ క్రిందనేవున్న కస్తూరిని గ్రహించలేక, ఆ సువాసన ఎక్కడినుంచో వస్తున్నదని భ్రమించి - అడవంతా తిరుగుతుంది. అలిసిపోయి ఒక చల్లని చెట్టుక్రింద పడుకొని, తన ముక్కును తన గొంతు దగ్గర పెట్టుకొని నిద్రించడానికి ప్రయత్నిస్తుంది. అప్పుడు ఈ మృగం కస్తూరి వాసన తననుండే వస్తున్నదని గ్రహిస్తుంది. అప్పుడు ఆ మృగం ఎక్కడికీ సంచరించకుండా అక్కడనే వుండిపోతుంది. అదేవిధంగా మానవుడు అజ్ఞానంలో తనయందే ఉన్న ఆనందమును గ్రహించుకోలేక, ఈ ఆనందం కోసం బాహ్య ప్రపంచంలో వెదుకుతున్నాడు. మానవుడు తన దృష్టిని బహిఃర్ముఖం గావించుకున్నంతకాలం, ఆనందానికి దూరంగానే వుంటాడు. ఏనాడు తన దృష్టిని అంతఃర్ముఖం గావించుకుంటాడో ఆ నాడే సత్యానందాన్ని అనుభవిస్తాడు. అదే బ్రహ్మానందం, అదే ఆత్మానందం, అదే సత్యానందం.

## త్యాగం

ఈనాడు మానవుడు బాధలు, భేదములతో మునిగిపోతున్నాడు. లింగ భేదములు, భాషా భేదములు, మత భే

ములు – అంతా భేదములే. యుద్ధ భయం, ఆస్తి భయం – సర్వమూ భయమే. పైపెచ్చు అనావృష్టి భయం, అతివృష్టి భయం. అంతేకాదు క్షణక్షణం సందేహాలతో మునిగిపోతున్నాడు. భయ భేదములు రెండూ మానవుని బంధిస్తున్నాయి. ఇవి పోవాలంటే కొంచెం త్యాగం చేయడం నేర్చుకోవాలి. త్యాగమనగా ఏమిటి ? ఆస్తిని, ఆలిని వీడి కానల కేగడం కాదు. మానవత్వంలో నున్న భేద భావములను దూరం చేయాలి. భావమందు దుష్ట భావము వీడుటే త్యాగమగును. అదియే యోగమగును. ఈనాడు మన జాతి లౌకికంగా, భౌతికంగా కొంత అభివృద్ధి గాంచింది. నైతికంగా చూస్తే క్షుద్ర విమర్శలు, సంకుచిత భావములు మితిమీరి పోతున్నాయి. స్వార్థం చేతిలో మానవుడు కీలుబొమ్మై జీవిస్తున్నాడు. ఈ స్వార్థం స్వప్రయోజనం అనే సంకెళ్లను ఏనాడు ఛేదించుదుమో ఆనాడే మనకు ఆనంద ప్రాప్తి. స్వార్థం అనేటటువంటి దానిని పరార్థంగా మార్చుకోవాలి.

## దుఃఖం

దుఃఖమునకు రూపమేమిటి ? భ్రాంతులయొక్క వికల్పమే. దుఃఖమునకు రూపము లేదు. తాను వాంఛించినది లభించకపోవడమే దుఃఖమునకు కారణం. ఈ వాంఛలకు కారణమేమిటి ? ఈ వాంఛలన్నీ జగత్ స్వరూపములైన భ్రాంతులే. భ్రాంతులకు అతీతమైన స్థితిలో మనం ప్రవేశించాలి. భ్రాంతులు గుణము చేతనే లభించినటువంటివి. గుణాతీతుడు భగవంతుడు . అట్టి స్థాయిని మనం చేరినప్పుడే ఈ భ్రమలన్ని బ్రహ్మమయంగా మారిపోతాయి. ఆ నాటి గోపికలకు ఒక్క కృష్ణ భ్రాంతి తప్ప అన్య భ్రాంతులు ఏమాత్రం లేవు. వారు శాస్త్రాలు చదవలేదు, పురాణాలు పఠించలేదు, యజ్ఞ యాగాది క్రతువులు ఆచరించలేదు. అయినప్పటికీ వారు కృష్ణుని అనుగ్రహానికి పాత్రులైనారు. కారణం ? వారిది అన్యోన్య ప్రేమ, నిర్మలమైన ప్రేమ, నిస్వార్థమైనటువంటి కర్మ. ప్రేమ ఎక్కడవుందో అక్కడ శ్రద్ధ వుంటుంది.

" శ్రద్ధావాన్ లభతే జ్ఞానం "-
శ్రద్ధవున్న వారికి జ్ఞానం లభిస్తుంది. ఎక్కడ జ్ఞానమో, అక్కడ సాధన. ఎక్కడ సాధనో, అక్కడ సాధ్యం. ఆ సాధ్యమే పరమభక్తి, ఆ పరమభక్తియే అన్యోన్యభక్తి. ఇదియే నిజమైనటువంటి త్యాగం.

## నామము, దానము

ఈనాడు కలియుగంలో నామము, దానము అనేవి రెండే మనకు ప్రధానమైనవి. ఏ దానము ? ఏ నామము ? దానమంటే నామం పెట్టడం కాదు. దానమంటే అన్నదానం. నామ మంటే భగవన్నామం. కారణమేమిటి ? " అన్నం బ్రహ్మ " – ఆ బ్రహ్మతత్వాన్ని ఈ రూపములో మనం అనుభవించాలి. నామములో నామినమును మనం దర్శించాలి- కనుకనే జడ చైతన్యములు రెండును కూడను నామ నామినములుగా వుంటున్నాయి – దీనినే క్షేత్రజ్ఞ క్షేత్రములుగా రూపొందుతున్నాయి. ఇదే ఆత్మ అనాత్మగా రూపొందుతున్నాయి. దీనినే దేహి, దేహము అనబడి కూడా పిలువ బడుతున్నాయి. దీనినే శరీరము, శరీరి అనికూడా పిలువబడుతున్నాయి. అనగా ఒకటి చైతన్యము, మరొకటి జడము. ఈ చైతన్యములయొక్క విభాగములను గావించడమే ప్రధానమైన సాధన. లేక రెండింటిని ఏకత్వం గావించడమే ప్రధానమైన సాధన. అందులో మనం ఏకమైనప్పుడే ఈదివ్యత్వాన్ని మనం అనుభవించగలుగుతాం.

## ప్రేమ ద్వారా ...

ప్రేమ ద్వారానే మనం భగవంతుణ్ణి పొందుటకు ప్రయత్నించాలి. ఈ ప్రేమ తప్ప అన్యమార్గంలో ఏమాత్రం మనం భగవంతుణ్ణి పొందలేం. తపములు చేయవచ్చును. ఇది కేవలం ఒక విధమైన సత్కర్మలుగా భావించవచ్చును. యజ్ఞయాగాది క్రతువులు ఆచరించవచ్చును. తద్వారా చిత్తశుద్ధి కలుగవచ్చు.
" చిత్తస్యశుద్ధయే కర్మః "
కర్మల ద్వారా చిత్తశుద్ధి కలుగవచ్చును. తర్వారా మనం

స్వర్గాన్ని పొందవచ్చును. తిరిగి ఆ పుణ్య కర్మ లు నశించిన తక్షణమే తిరిగి మర్త్యలోకమునకు రావలసినదే. ఇవన్నీ కూడను మనం తాత్కాలిక సుఖమును కోరే ఆచరిస్తున్నాం. ప్రేమ ద్వారా మాత్రమే నరాసరి భగవంతుణ్ణి చేరడానికి వీలవుతుంది. కనుక సర్వులను మనం ప్రేమగా చూడగలగాలి. సర్వులయందు ఉన్న ప్రేమ స్వరూపాన్ని మనం దర్శించాలి.

## కామ, క్రోధ, లోభ

కామ, క్రోధ, లోభములే సాధకునికి పరమ శత్రువులు. ప్రేమను పొందడానికి ఈ మూడు ఆటంకముగా నిలుస్తున్నాయి. ఈ మూడింటిని సంహరించే నిమిత్తమే రామాయణ, భారత, భాగవతములు అవతరించాయి. రామాయణంలో రావణుడు కామంగా రూపొందుతూ వచ్చాడు. కామం పెరిగి పెనవేసుకుని ఉరిగా మారి పోయింది ఈ రావణునికి. చిట్టచివరికి రావణుడు తన వంశాన్నే నాశనం గావించుకున్నాడు. భాగవతంలో హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు – కేవలం ద్వేషంతో జీవిస్తూ వచ్చారు. క్రోధంతో నడిచారు. హిరణ్యకశిపుడు కేవలం హరి ద్వేషి. అయితే హిరణ్యకశిపుడు సామాన్యుడు కాదు. ఈనాటి వైజ్ఞానికులలో మితిమీరినటువంటి శక్తి కలవాడు. సర్వత్రా పరిశోధనలు గావించాడు. పంచభూతములను వశం చేసుకొన్నాడు. “భగవంతుడు ఎక్కడా ? ఎక్కడా?” అని సముద్రాలను గాలించాడు. చేప వలె జలములో సంచరించాడు. పక్షి వలె ఆకాశంలో ఎగురుతూ వెళ్ళాడు. ఎన్ని శక్తులు సంపాదించినా ప్రయోజనం ఏమిటి ? ఇవన్నీ భౌతిక శక్తులే. దైవాన్ని మరచిన తరువాత ఎన్ని ఉండి ఏం ప్రయోజనం ? "Hero becomes Zero if he forgets God" దైవాన్ని మరచినటువంటి శక్తి ఎన్ని సంపాదించినా ప్రయోజనం ఏమిటి ? దైవాన్ని మరవడం చేతనే క్రోధం మితిమీరి పోయింది. కోపం గలవానికి అన్నీ కష్టములే, నష్టములే. అతను సమాజంలో ఏమాత్రం మంచిపేరును పొందలేదు – కన్నకొడుకు,

“శ్రీవాణి” జీవిత సభ్యులు



శ్రీ కురిచేటి రామచంద్రరావు
మచిలీపట్నం

చిట్టచివరకు భార్య కూడా విరోధిగానే మారుతారు. ఈ క్రోధమువలననే హిరణ్యకశిపుడు ఏమైనాడో అందరికి తెలుసు. భారతంలో దుర్యోధనుడు పరమ లోభి. ధర్మమూర్తులైన పాండవులకు సూది మొన మోపే స్థలము కూడా యివ్వడానికి నిరాకరించాడు. తనది కాని దానిని తాను అనుభవించడానికి ప్రయత్నించి దుర్యోధనుడు పరాభవం పొందాడు – తన కుటుంబాన్ని సహితం సర్వనాశనం గావించుకున్నాడు. కనుకనే రామాయణం లోపల కామం, భాగవతంలోపల క్రోధం, భారతం లోపల లోభం – ఈ మూడింటిద్వారానే సర్వశక్తివంతులైన వారు సహితం సర్వనాశనం అయినారని పురాణములు బోధిస్తున్నాయి.

ఈనాటి కలియుగంలో యీ మూడు దుర్గుణాలు కామ, క్రోధ, లోభములు ఒకే వ్యక్తిలో కూడుకొని వుంటున్నాయి. ఒక్క దుర్గుణం వుంటేనే, అలనాడు అంతటి శక్తివంతులు సహితం పతనమై పోయినారు. కాని

ఈ మూడు దుర్గుణములు ఒకే వ్యక్తిలో కూడుకున్నప్పుడు ఇంకా ఎంత హీనస్థితికి దిగజారిపోతాడో ? అయితే ఈ సర్వ దుర్గుణములను కూడను ఒక్క సర్వేశ్వరుని నామంతో మనం పరిహారం గావించుకో వచ్చును. ఈనాడు శివరాత్రి. మంగళప్రదమైనరాత్రి. రాత్రి అనగా చీకటితో కూడికొనినటువంటిది, కాని ఈనాడు శివరాత్రి మంగళకరమైనటువంటిదానితో కూడికొనినటువంటిది. అనగా "చంద్రమా మనసో జాతః చక్షు స్సూర్యో అజాయతః "మనసుకు చంద్రునికి సన్నిహిత బాంధవ్య ముంటుంది. ఈనాడు చతుర్దశి. చంద్రునికి పదహారుకళలు. మానవుని మనసుకు కూడా పదహారు కళలు. ఈనాడు 15 కళలుదాటి ఒక్క కళలోనే ఉంటున్నాడు. మనకు అతి సమీపంలో ఉంటున్నాడు సన్నిధికి చేరడానికి. దైవత్వానికి అతి సమీపంలో ఉన్నటువంటిది మానవత్వం కనుక ఈనాడు చిత్తశుద్ధితో భగవన్నామ స్మరణ చేస్తే, అతి శీఘ్రంగా ధన్యులమవుతాం. కనుక ఈనాడు ఏ అన్య చింతలకు ఏ మాత్రం అవకాశం యివ్వకుండా దైవ చింతన యందే కాలమును సద్వినియోగం గావించు కోవడం అత్యవసరం. అమూల్యమ్మయిన ఈ కాలాన్ని ఆరక్షణం కూడా వృథా చేయరాదు- కాలం క్షణ క్షణం ఐసుగడ్డ వలె కరిగిపోతుంటుంది - చల్లబడ్డ కుండలోని నీరు కారి పోతున్నట్లుగా మన ఆయుః ప్రమాణం తరిగిపోతున్న దనే నగ్న సత్యాన్ని విస్మరించకండి. ఇలాంటి పరిస్థితు లలో మనం ఏమాత్రం కాలమును వ్యర్థం చేయరాదు. ఇలాంటి సదవకాశాన్ని సద్వినియోగ పరచుకోవాలి. సత్కర్మల నాచరిస్తూ దైవచింతనలో నిమగ్నులవ్వాలి.

(మహాశివరాత్రి సందర్భమున (24-2-87) ప్రశాంతి నిలయంలో భగవాన్ సత్యసాయిబాబాగారి ప్రసంగంనుండి)



## నీతి మంజరి

శ్లో॥ సర్వస్య గాత్రస్య శిరః ప్రధానమ్
సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్
షణ్ణాం రసానాం లవణం ప్రధానమ్
భవేన్నదీనా ముదకం ప్రధానమ్

ప. అరయ దేహమందు శిరము ప్రధానమ్మ్మౌ
ఇంద్రియముల లోచనేంద్రియములు
ఆఱు రసములందు నగు ప్రధాన ముప్పు
నదుల కిల ప్రధాన ముదక మంద్రు

శ్లో॥ కృషితో నాస్తి దుర్భిక్షం
జపతో నాస్తి పాతకమ్
మౌనేన కలహం నాస్తి
నాస్తి జాగరతో భయమ్

ప. కఱువులేదు భుక్తికి కృషి గలిగియున్న
పాపమను మాట లేదు జపంబుఁ గొన్న
కలహమే లేదు మౌనంబువలన మన్న
జాగరూకతయున్న త్రాసంబు సున్న

శ్లో॥ అర్థానా మార్జనే దుఃఖం
ఆర్జితానాంచ రక్షణే
రక్షితానాం వ్యయే దుఃఖం
కిమర్థం దుఃఖభాజనమ్

ప. ఆర్జనమున దుఃఖ మది రక్షణకు దుఃఖ,
మాయమన్న దుఃఖ, మది వ్యయింప
దుఃఖ, మెట్టులేని దుఃఖభాజనమైన
ధనము కొఱకు నింత తపన యేల

— పృథివి సుబ్బనాగయ్యకవి

సర్దార్ ఫతేఖాన్ పెద్ద సైన్యంతో శివాజీ మీదికి వెళ్లు తున్నాడని, మరొక ప్రక్కనుంచి జనరల్ ఫర్రద్‌ఖాన్ శివాజీ అన్న శంభాజీ మీదకు దండెత్తుతున్నాడనే వార్తలను ప్రచారం చేయిస్తాడు. శివాజీ గనుక లొంగకపోతే తండ్రి ప్రాణాలకే ముప్పువాటిల్లుతుందని హెచ్చరిస్తాడు. అన్ని వైపులనుంచి ఒకే పర్యాయం ప్రమాదం వచ్చి మీద పడుతుండటం వలన శివాజీ కొంచెం బాధపడుతాడు. 14 వత్సరాలుగల శివాజీ భార్య సాయిబాయి భర్తకు తగ్గ భార్యగా నిరూపించుకుంది. "ఎందుకు బాధపడుతావ్! మీ నాన్నగారిని ఏదోవిధంగా విడుదల అయ్యేట్లుగా చూడు. శత్రుమూకలను చెండాడి స్వాతంత్ర్యమును నిలుబెట్టుకోవడానికి ప్రయత్నించు" అని హెచ్చరిస్తుంది.

కొమ్మిరెడ్డి కృష్ణమోహనరావు

## సమయస్ఫూర్తి

శివాజీకి ఒక మంచి ఆలోచన మనసులో తళుక్కున మెరుస్తుంది. పురందగఢ్ సేనాని ఒకప్పటి బీజాపూర్ సుల్తాన్ ఉద్యోగి. మృదుమధురమైన మాటలతో అతని హృదయాన్ని వశంచేసుకొని, తన సైన్యాన్ని కొంత అక్కడ వుంచుతాడు. ఆ కోట గెరిల్లా యుద్ధానికిఅనువైన ప్రదేశం. ఆ కోటమీదకు వచ్చిన ఫతేఖాన్‌ను మాడు అదరకొడతాడు. ఆ దెబ్బకు తట్టుకోలేక ఆ సేనాని పారిపోతాడు. శంభాజీ కూడా ఫర్రద్‌ఖాన్‌ను తరిమి కొడుతాడు. అయితే తండ్రిని ఎలా విడిపించడమా ? అని ఆలోచిస్తుండగా ఒక ఉపాయం తడుతుంది. ఢిల్లీ చక్రవర్తి షాజహాన్ ఎంతోకాలం నుండీ బిజాపూర్ సుల్తాన్‌ను వశంచేసుకోవాలని ఆలోచిస్తుంటాడు. శివాజీ విజ్ఞతతో ఈ అవకాశమును వినియోగించుకోదలచి ఢిల్లీ చక్రవర్తికి ఉత్తరం వ్రాస్తాడు "మా తండ్రి విడుదలకాగానే, నేనూ మా తండ్రి మీకు సేవచేస్తాం" అని వ్రాస్తాడు. ఈ చర్య శివాజీ రాజనీతిని, దూరదృష్టిని సూచిస్తుంది.

మన శత్రువుకు శత్రువు మనకు మిత్రుడవుతాడనే రాజనీతిని బాగా తెలిసినవాడు శివాజీ. ఇది తెల్సిన బిజాపూర్ సుల్తాన్ ఢిల్లీ చక్రవర్తి ఎక్కడవచ్చి మీద పడుతాడోనని భయపడి శివాజీ తండ్రిని బేషరతుగా విడుదలచేస్తాడు. ఆ విధంగా వివేకంతో ఆ వచ్చిన ప్రమాదం నుండి శివాజీ తప్పించుకుంటాడు. ప్రతి సంఘటనలోను శివాజీ సమయస్ఫూర్తిని ప్రదర్శించి ఆపదలను నుండి బయట పడుతాడు. సమయస్ఫూర్తి, వివేకములు రాజనీతికి ఆయువుపట్టులు.

## విజయపరంపర

శివాజీకి 28 సంవత్సరాలు వచ్చేటప్పటికీ కొండన, పురందర, కల్యాన్, రాయిగఢ్‌లు మొదలగు 40కోటలను స్వాధీనం చేసుకొని విజయపతాకాలను ఎగురవేస్తాడు. ఆసమయంలో పశ్చిమతీరాన ఇంగ్లండు వారు, పోర్చుగీసు వారు వ్యాపారపు మిషతో వచ్చి, స్థావరాలను ఏర్పర్చుకొని మన దేశాన్ని కబళించడానికి, అవకాశం కోసం ఎదురు చూస్తూ ఉంటారు. రానున్న ప్రమాదాన్ని శివాజీ ముందుగానే గ్రహిస్తాడు. సముద్ర తీరాన కోటలను ఏర్పర్చి, యుద్ధనౌకలను నిర్మించి, నావికా సైన్యమును సహితం తయారు చేసుకుంటాడు. విదేశీయులద్వారా రానున్న ప్రమాదమునుముందుగా గ్రహించినవాడు శివాజీమాత్రమే.

## అఫజల్‌ఖాన్

సుల్తాన్ అదిల్‌షా శివాజీ వలన తనకు కూడా ప్రమాదం తప్పదని భావిస్తాడు. ఆ సుల్తాన్ పెంపుడు తల్లి ఉలిమా భేగం ఒకరోజున దర్బార్‌ను ఏర్పర్చి శివాజీని జయించి బంధించి తీసుకొని వచ్చిన సేనానికి గొప్ప బహుమతి యివ్వబడుతుందని ప్రకటిస్తుంది. ఏడడుగులు ఎత్తుగల బలిష్ఠుడైన పఠాన్ జనరల్ అఫజల్‌ఖాన్ ఈ సవాలును స్వీకరించి ముందుకు వస్తాడు. ఇతను మహాక్రూరుడే కాదు, వంచనచేయగల సమర్థుడు కూడాను. ఇతను 25 వేల సుశిక్షితులైన సైనికులను వెంటబెట్టుకొని శివాజీ

( తరువాయి 45వ పేజీలో )

# జ్యోతిషవాణి

నిర్వహణ : దైవజ్ఞరత్న వాస్తు జ్యోతిష విద్వాన్

**కవితా కామేశ్వర శర్మ**

అవనిగడ్డ - 521 121

యస్. శ్రీనివాసరావు — పెడన

సమా : ఉద్యోగం వస్తుంది. వివాహం 1988 **లో.** 1987 అనుమానం. అనుకున్న **వారితో** వివాహం జరిగి తీరునని తోచదు. అయితే ఆక్షేపణ లేదు.

బి.హెచ్. వి. హనుమచ్ఛాస్త్రి — **గుంటూరు**

**సమా :** 1987లో ఉద్యోగం, స్థానం మారే అవకాశం వుంది. శివప్రియ వివాహం తల్లి బ్రతికి వుండగానే జరుగును. కుర్రవానికి ఇంకో సంవత్సరం వరకు వివాహం వద్దు.

యం. శ్రీనివాస్ — ఆచంట

సమా : మీ జాతక వివరాలు బాగా పంపినారు. Clearగా ఉన్నవి. ప్రస్తుతం మీకు రాహుదశ. ఇది వెళ్ళితేనేగాని మంచికాలం కాదు. 22-1-89తో రాహుదశ పూర్తి. గ్రామోదయ పథకంక్రింద ప్రభుత్వ సహాయం లభిస్తుంది. వాతావరణ పరిస్థితులబట్టి ఏ వ్యాపారమైనా చేయవచ్చు. రోజులు మంచివైతే సరి.

మీరు జ్యోతిశ్శాస్త్రము అధ్యయనంచేస్తే బాగుంటుందా అని అడుగుతున్నారా ? తప్పకుండా చెయ్యండి. చెప్పే వారుంటే ప్రయత్నించండి. మీకు కోపం జాస్తి గదా ! ఎట్లా ! ఎంతో ఓర్పు ఉంటేనేగాని జ్యోతిషం రాదు.

కాచిభొట్ల శ్రీనివాస — సింగరాయకొండ

సమా : మీ గ్రహస్థితి ఏమీ బాగాలేదు. శని దోషం బాగావుంది. శని జపం, సుందరకాండ పారాయణ, విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణలు ముఖ్యం. జీవితాశయం నెరవేరును.

విజయ కామేశ్వరి — భీమవరం

సమా : మీ బాధలు హృదయవిదారకము ఏం చేస్తాం. రాహుదశ అలాంటిది. గురుదశ వచ్చింది గదా ! క్రమశః సర్దుబాటు అవుతవి. శివుని ఆరాధించండి ఏదోవిధంగా. మీరడిగిన విషయాలు ఇందులో యింతకన్న ఎక్కువ వ్రాయ వీలులేనివి. ప్రత్యేకంగా జాబు వ్రాస్తాను. యింత కన్నా నే చేసే పరోపకారమేముంది. ధైర్యమే లక్ష్మి అన్నారు. కష్టాలు కాపురం చెయ్యవు. ఆమాటకు వస్తే చేసుకున్న వారే కాపురాలు చేయడం లేదు మానవుడై వుండికూడా.

ఈనాడు స్త్రీల నుద్ధరిస్తామని చెప్పేవన్నీ ఉత్తర కుమార ప్రజ్ఞలు. కోర్టుకు వెళ్ళితే ఎన్నో సంవత్సరాలు పట్టును. న్యాయవ్యవస్థ అలావుంది. దేశం బాగుపడే దెప్పుడో తెలియదు. తుదకు వేదాంతం చెప్పుకుని ఊరట చెందాలి- " మన కర్మ " అని.

రమా కిరణ్మయి — "—— ——"

సమా : ప్రారబ్ధం అనుభవించక తప్పదు. ఇంతకాలం గడిచెగదా ! ముందుమాత్రం గడువదూ. చేయదగినది ఏమీ లేదు. భగవద్ధ్యానం. అది- హనుమాన్ : ప్రదోషకాలంలో శివదైవ దర్శనం. కష్టాలకు మనసును అలవాటు చేసుకోవడం, పురుషాధిక్యత తగ్గేవరకు స్త్రీలు అబలలే. నా సానుభూతి.

---

**జ్యోతిషవాణి**

పేరు ..................................................

పూర్తి చిరునామా ......................................

..................................................

లేఖ వ్రాయు తేది..............................

టైము పగలు/రాత్రి..........................

జనన తేది............లేనిచో సుమారు వయస్సు

---

" కూర్చోండి "

నేలమీద కూర్చున్నారిద్దరూ.

" నేను బాబూ లతమ్మగారి పనిమనిషిని సమ్మక్కని "

సమ్మక్కను రాజు ఎన్నోసార్లు చూచి వుంటాడు.

" ఔ " నన్నట్లు తల వూపాడు.

# డాక్టర్ ముదిగొండ శివప్రసాద్




# హ్యూమానిటీ ఫర్ సేల్

" ఇది మా చెల్లి..వడ్డేపల్లి పీళ్ళది-నిన్న వచ్చింది " సారక్క తడిసిన చీరె చెంగునుండి నీళ్ల బిందువులు బిందువులుగా మోజేయిక్ ఫ్లోరింగ్‌ను తడుపుతున్నాయి. పమిటచెంగును ముసుగుగా తలపైనుండి కప్పుకుంది సారి– ఆమె ముంగురులు వానకు తడిసి ఆ బిందువులు చెక్కిళ్ళపైకి జారుతున్నాయి. సాభిప్రాయంగా సారిని చూచాడు రాజు. రాజుతో సమ్మక్క ఏదో చెప్పింది.

రాజు విన్నాడు – ఆమె చెప్పినదానికన్నా చెప్పకుండా వదిలిన మాటల వల్లనే ఎక్కువగా గ్రహించాడు.

సారిని లోపలకు రమ్మన్నాడు.

వానకు తడిసిన నెమలిలా భయంగా బాధగా సారి, గదిలోనికి నడిచింది.

నీళ్ళలో ఈదే హంసలా తడి గుడ్డలతో ఆమె తడబడుతూ ముందుకు సాగింది.

ఓ పదిహేను నిమిషాల తర్వాత రాజు ఇవతలకి వచ్చాడు సమ్మక్కతో చెప్పాడు " లాభంలేదు–ఇప్పటికే మించిపోయింది " ఆకాశం పెద్దగా ఉరిమింది – ఎక్కడో మరి పిడుగులు పడ్డాయి.

సారి కుప్పకూలిపోయింది.

సమ్మక్క జీవనశక్తినంతా కూడదీసుకొని లేచి రాజు రెండు కాళ్ళనూ పట్టుకున్నది.

రాజు దయామయుడు. స్త్రీ అలా తన పాదాలపై బడటం సహించలేనివాడు.

బయటి ముసురువలెనే అతని కరుణకూడా జల్లులు జల్లులుగా, తుషారఫీనంలా, ఆర్ద్ర శీకరాలుగా సమ్మక్కపైనా సారక్కపైనా వర్షించింది. "లేమ్మా–లే".

సమ్మక్క లేవలేదు. రాజు దూరంగా నడిచి కుర్చీలో కూర్చున్నాడు.

"సారి మళ్ళీ హనుమకొండ పోతుందా?"

"ఎట్లా పోతుంది బాబూ, ఏ ముఖం పెట్టుకొని పోతుంది" రాజు ఏమీ మాట్లాడలేదు.

సమ్మక్కకు ఆయన మాట్లాడకపోవడమే ఎంతో ఆనందంగా వుంది. అదే శ్యాం అయితే కాకిలా పొడిచి వుండేవాడు. పుండును పుల్ల పెట్టి కెలికినట్లు కుళ్ళబొడిచే వాడు మాటలతో. 'బుద్ధిపెడతల బట్టి కాలు జారినప్పుడు లేదా ఈ జ్ఞానం' అని అడిగేవాడు "మీరు చేసిన పాపాలన్నిటికి మేము శిక్ష ననుభవించాలి" అని తానేదో పాప పరిహారమూర్తిలా పోజు పెట్టేవాడు. "డబ్బు తీసుకురా" అని ముందే గద్దించేవాడు. అదేమీ లేదు రాజు దగ్గర. కొన్ని క్షణాల భయంకరమైన మౌనం అనంతరం రాజు అన్నాడు "మీరు పేదవారు. ఆమె మళ్ళీ ఈ దురవస్థలో వడ్డేపల్లి పోలేదు, పోయి తోటి సమాజంలో నవ్వులపాలు కాలేదు, తలెత్తుకు తిరగలేదు. కాబట్టి నాకు తెలిసిన ఒక అనాధశరణాలయం వుంది. అక్కడికి ఈమెను పంపివేస్తాను, వాళ్ళే పని ఇస్తారు, పురుడు పోస్తారు. ఆ తర్వాత బిడ్డకు చదువూ సంధ్యాకూడా చెప్పిస్తారు. మీరుమాత్రం సారి చనిపోయిందని బంధువులకు చెప్పుకోండి, ఏం చేస్తారు మరి". సమ్మక్కకు రాజు దేవుని రూపంలా కనపడ్డాడు క్షణంసేపు. యాదగిరి లక్ష్మీనరసింహస్వామిలా దీనదయాళునిలా క్షుద్రులకోసం పతితుల కోసం పాపులకోసం శిలువనెక్కిన జీససులా, గొర్రెపిల్ల నెత్తుకున్న గౌతమ బుద్ధునిలా – సమ్మక్క సారక్క తమ కన్నీళ్ళతో రాజు పాదాలను అభిషేకించారు.

బయట వాననీళ్ళలోలేని వేడీ విద్యుత్తూ వాటిల్లోనుండి ప్రవహించి రాజు కాళ్ళను చుర్రుమని కాల్చాయి.

* * *

రాణి ముఖం కడుక్కుంటూ వాంతి చేసుకుంది.

ఆమె కళ్లు గిర్రున తిరిగాయి. తల చేత్తో పట్టుకొని సోఫాలో కూలబడింది.

పనిమనిషి తెచ్చిచ్చిన కాఫీ రుచించడంలేదు.

మేడపైన తన గదిలోకి వెళ్ళి చదువు నటిస్తూ ఫస్టు డెలివరీ పోస్టుమాన్ కోసం ఎదురు చూస్తూ కూర్చుంది.

పది గంటలకు టంచన్‌గా పోస్టుమాన్ వచ్చాడు. ఆదరాబాదరా కిందికి దిగివచ్చింది.

(జరిగిన కథ)

శ్యాం వెంటనే ఆ బంగారం ఇచ్చిపో అన్నాడు ఆ మంగళసూత్రాల వంక చూస్తూ. అయితే చంద్రయ్య తన కోపాన్ని తమాయించుకోగలిగాడు. సమ్మక్క మాత్రం ఆపుకోలేక రెండు దులిపేసి బిడ్డణ్ని భుజాన వేసుకొంది. ఆ రాత్రల్లా వర్షం. ఎడాపెడా బాది వదిలిపెట్టింది. గత్యంతరం లేని దశలో బిడ్డడి రోగం ప్రకృతి వైద్యంతో నయమయింది. ఆకలిని సూచిస్తూ ఏడుపు మొదలెట్టాడు. అయితే ఈ రోజు చెల్లెలి కోసం సమ్మక్క మళ్ళీ రాజు దవాఖానాకి వెళతానంటుంది. తలుపు తీయగానే డా. రాజు అగుపిచ్చాడు. రాజు వాళ్ళని పైకి రమ్మనగానే సారక్క భయం భయంగా సమ్మక్కతో పాటు లోపలకి నడిచింది.

(ఇక చదవండి)

కింద శ్యాం చేతికి రాజుకు సంబంధించిన జాబులుఇచ్చి అప్పటికే అతను పక్కింటికి వెళ్ళిపోయాడు.

"నాకేం జాబులు లేవా ?"

"లేవండీ"

రాణి మళ్ళీ మేడపైకెక్కింది. సెకండ్ డెలివరీ కోసం నిరీక్షణ ప్రారంభం.

పన్నెండు నలభై అయిదుకు సెకండ్ డెలివరీ, అందులోనూ జాబులు లేవు.

సాయంత్రం నాలుగున్నరకు మూడవ డెలివరీ.

అందులోనూ అంతే!

రాణి అయోమయ పరిస్థితిలో పడ్డది.

ఆమె మనసంతా చికాకుగా వుంది.

సాయంత్రం తల్లి ఫారిన్ నైలెక్సు కొనుక్కుంటానంటే తానూ అబిడ్స్‌కు వెంట వస్తానన్నది.

కాని ఇప్పుడు వెళ్ళాలనే బుద్ధి లేకుండాపోయింది.

కాని వెళ్ళకపోతే బాగుండదు.

ఎంతో కాలానికి ఎంతో ఆలస్యంగా కళావతి కడుపుతో వుంది మళ్ళీ.

రాజుకు ఆనందం చెప్పశక్యం కాదు. నలుగురూ వింటే ఉప్పెద అని తహస్యంగా దాచారీ విషయం. అలాంటిది తల్లి కొత్త చీరెలు కొనుక్కుంటున్నది. ఏదో నలుగురికీ తెలియకుండా వేడుక జరుపుకో బోతున్నది. ఇవ్వాళ సాయంత్రం తల్లి వెంట బజారుకు వెళ్ళాలా? వద్దా?

సాయంత్రం మూడవ డెలివరీ పోస్టుమాన్‌కూడా వెళ్ళాడు- లేచి నిరుత్సాహంగా ముఖం కడుక్కొని ఫుల్ వాయిల్ చీరె కట్టుకుంది.

తల్లి దగ్గరికి వెళ్ళింది.

నిజానికి ఆమె రాణిని చూచి సిగ్గుపడుతున్నది.

లోలోపల ఆనందపడుతున్నది.

కళావతి సంతోషాన్ని ఆమె బుగ్గలే ప్రతిఫలిస్తున్నాయి.

ఇరువురూ కలిసి కారెక్కారు.

కారు ఆబిడ్స్‌లో ఆగింది.

కళావతి చీరెలు బేరం చేస్తున్నది.

రాణికెందుకో తనకే ఈ వేడుకలు జరుగుతున్నట్లు క్షణకాలం భ్రమ కలిగింది.

తనే గాజులు వేసుకొంటున్నట్లు....

తానే తోతారామ్ పాపాలాల్‌లో నగ కొనుక్కుంటున్నట్లు, ఋవేరీలో దిద్దులు బేరమాడుతున్నట్లు- కొనడాలన్నీ అయిపోయాయి

కళావతి తృప్తిగా కారెక్కింది.

రాణి శూన్యంలోకి చూస్తూ కూర్చుంది.

కారు మళ్ళీ తిలక్ రోడ్డుమీదుగా సావర్కార్ విగ్రహం నుండి బరకత్‌పురా దూసుకొనిపోయింది.

రాణి కారులోనే ఒక నిశ్చయానికి వచ్చింది.

రేపే బయలుదేరి రవి స్వగ్రామానికి వెళ్ళాలని తీర్మానించుకొంది.

"అమ్మా రేపు మా ఫ్రండ్‌ది మారేజి వుంది, దానికి అటెండ్ కావాలి."

"అలాగే- కారు తీసుకొనివెళ్ళు."

"ఈ ఊళ్ళో కాదు, గద్వాలలో. మా స్నేహితురాండ్రంతా ఒక కారులో వెళుతున్నారు-నేను వెళతానమ్మా."

కళావతి మౌనంగా వుంది, అది అంగీకారానికి సూచన.

రాత్రి ఇంటికి పోయిన తర్వాత ఏమీ తినలేదు.

ఫాన్ వేసుకొని అలా బెడ్‌కు అంటిపెట్టుకొని పడుకుంది. నిద్ర పోవడానికి బ్రహ్మప్రయత్నం చేసింది. రాత్రి గడిచిపోతున్నది. రాత్రే గడిచిపోతున్నది కాని ఆమె ఆలోచనావాహినికి సుషుప్తి అడ్డుకట్టలు కట్టలేక పోయింది. లేచి వెళ్ళి రెండు స్లీపింగ్‌పిల్స్ మింగి పడుకుంది. నిద్రవంటి ఒక ఉన్మత్తమైన మత్తు ఆవరించింది.

ఉదయం లేచేసరికి ఆమె ఒళ్ళంతా నలగగొట్టినట్లుంది. నిద్రవల్ల వచ్చే విశ్రాంతి ప్రశాంతి ఈ పిల్స్‌వల్ల లభించలేదు. ఉదయం ఓ చిన్న పెట్టెలో కావలసిన గుడ్డలు వగైరా సర్దుకొంది. సర్దుకొంటున్నప్పుడు వెనుక ఎవరో నిలిచినట్లయింది, ఉలిక్కిపడి చూచింది రాణి.

కళావతి వచ్చింది- "ఏమమ్మా - పెళ్ళికూతురుకు ఏం ప్రెజెంట్ తీసుకుపోతున్నావు?"

రాణి కంగారుపడ్డది.... "ఆఁ.... ఇంకా ఏమీ అనుకోలేదమ్మా."

"నా దగ్గర బొమ్మల్లో ఓ మంచిది ఇస్తానుండు" అని కళావతి వెళ్ళి ఓ బొమ్మ తెచ్చి యిచ్చింది. జోడు గుర్రాల బగ్గీని నడుపుతున్న ఓ అశ్వికుడు. అందమైన దంతపు బొమ్మ.

రాణి దాన్ని ఓ పేపర్‌లోపెట్టి పెట్లో పెట్టుకుంది. నాలుగు మెతుకులు ఎంగిలిపడి ఓ రిక్షా ఎక్కి బస్‌స్టాండు చేరింది. యాదగిరిగుట్టకు పోయే బస్ ఒకటి స్టాండ్‌మీద నిలబడి వుంది. తాను వెళ్ళవలసింది గద్వాలకు కాదు, భువనగిరికి. అది యాదగిరిగుట్ట పోయే దోవలోనే వస్తుంది. ఎక్కి కూర్చుంది తీర్థయాత్ర చేసే ప్రయాణికురాలిలా. (సశేషం)

# దంత సంరక్షణ — యస్. యన్. దుర్గారావు

ఆరోగ్య సూత్రాలలో దంత సంరక్షణ ముఖ్యమైనది, అవసరమైనది.

చాలామంది ఆహారం భుజించిన వెంటనే నోరు శుభ్రపరచుకోరు. ఇటువంటివారి దంతాలు త్వరగా చెడిపోతాయి.

నోటిలో దంతములమధ్య చిన్న చిన్న ఆహారతునకలు ఇరుక్కుపోయి నిలువవుండి, సూక్ష్మక్రిములచే పులిసి దుర్వాసన కొట్టటం మొదలవుతుంది. ఇలా రోజు రోజుకూ పెరిగి ఒకరకమైన ఈ చెడు ఆమ్లము పంటిపై నుండు గట్టి పొరపై దాడి జరిపి గుంటలు పడేటట్లు చేస్తుంది. మరియు ఈ ఆమ్లము పంటిపై పసుపురంగు గారవలె ఏర్పడుతుంది. పంటికుదురు దెబ్బతింటానికిది సహాయకారి అవుతుంది. ఇలా ఒక్కొక్క పన్ను పుచ్చి అంటే డొల్లపడి చివరికి పళ్ళన్నీ బలహీనపడి ఊడిపోవటం జరుగుతుంది. ఎప్పుడైతే దంతాలు అన్నీ ఊడిపోవటం ప్రారంభమవుతుందో తదుపరి దౌడ కండరాలు క్షీణించి, ఇతర శరీర భాగాలకు కూడా హాని ప్రారంభమై శరీరబలం తగ్గుతుంది.

ఎప్పుడైతే దంతాలు సరిగా లేవో అప్పుడు సరిగా ఆహారం నమలలేము, గట్టిపదార్థాలు తినాలన్నా తినలేము. ఆహారము సరిగా నమలని పక్షంలో అజీర్ణము చేస్తుంది. కాబట్టి ఇలా ఒకదానివెంట ఒకటొకటి దుష్పరిణామాలు జరుగకుండా ఉండాలంటే ఆదిలోనే దంతరక్షణ మంచిది.

దీనినిగూర్చి ఆయుర్వేదంలో విపులీకరించబడియున్నది.

ఉదయము కాలకృత్యాలనంతరం ఒకసారి, రాత్రి నిద్రపోయేముందు ఒకసారి దంతధావనము గావించుకోవాలి. భోజనం చేసిన వెంటనే పలుమార్లు నీటితో నోరంతా పుక్కిలించుకోవాలి. అప్పటికీ కొన్ని ఆహార తునకలు పోకున్న పుల్లముక్కతో మెల్లగా వాటిని తొలగించుకోవాలి. అంతేగాని సూది మొదలైన లోహములతో తయారుకాబడినవాటితో తీయరాదు. అలా చేసిన పళ్ళమధ్య ఖాళీలు ఏర్పడును.

దంతధావనానికి కొన్ని చెట్ల పుల్లలు కుంచెవలె చేసుకుని ఉపయోగించవచ్చు. అవి: జిల్లేడు, మారేడు, మద్ది, కానుగ, జువ్వి, రేగు, చండ్ర, మేడి, వేప, మామిడి, సంపెంగ, దిరిశెన, ఉత్తరేణి, జాజి, నంది వర్ధనం, బాడిద మొదలైనవి.




దంతధావనమునకు జిల్లేడు వీర్యమును, మారేడు ధనమును, మద్ది కాంతిని, కానుగ విజయమును, జువ్వి ధనసంపత్తిని, రేగు మధుర ధ్వనిని, చండ్ర, వావిలి సౌగంధ్యమును, మేడి వాక్శుద్ధిని, వేప క్రిమిహరిగను, మామిడి ఆరోగ్యమును, సంపెంగ వాగింద్రియ శ్రవణేంద్రియ దార్ఢ్యమును, దిరిశెన కీర్తి సౌభాగ్యములను ఆయురారోగ్యములను, ఉత్తరేణి ధైర్యమును, ధారణాశక్తిని, ప్రతిభను, శక్తిని, ధ్వనిని జాజి- నందివర్ధనము- బాడిద దుఃస్వప్న దోషహరమును సమకూర్చును.

కంఠము, దౌడ, పెదవి, నాలుక, పళ్ళు వీనియందలి రోగములున్నపుడు, ముఖమందలి వాపు, శ్వాసకాసలు, వమనము యివి వుండునపుడు దౌర్బల్యము, అజీర్ణము, హిక్కా, మదము, శిరో రోగములు, దప్పి, బడలిక,-

# ప్రశ్నలు - సమాధానాలు

1. ప్రపంచంలో కెల్లా రెండవ పెద్ద దేశమేది?
2. 100గ్రాుల కొబ్బరి ఎన్ని కేలరీల శక్తి నిస్తుంది?
3. ఫ్రాన్స్ దేశాధ్యక్షుడ్ని ఎన్ని సం॥ల కొకసారి ఎన్నుకొంటారు?
4. USAలోని ఫోర్ట్‌నాక్స్ దేనికి ప్రసిద్ధి?
5. తనచుట్టూ తాను ఒక్క సారి తిరగడానికి "మెర్క్యూరీ" గ్రహానికి ఎన్ని రోజులు పడుతుంది?
6. రవీంద్రనాథ్ టాగోర్ నోబుల్ ప్రైజ్‌ను ఎప్పుడు పొందాడు?
7. బస్‌కండక్టర్‌గా పనిచేసి సినిమాస్టారయిన ఒక నటుడు
8. "పార్థెనోఫోబియా" అంటే ఏమిటి?
9. భూకంపాలకు చెందిన శాస్త్రం పేరేమిటి?
10. "కాంతిసంవత్సరం" అంటే ఏమిటి?
11. ధ్వనినికొలచుటకు ఉపయోగించే యూనిట్ ఏది?
12. ఇండియన్ స్టాండర్డ్ టైమ్ దేనినాధారంగా లెక్కింపబడును?
13. రాజ్యసభ సభ్యుని కాలపరిమితి ఎంత?
14. వేదగణితం అనే గ్రంథాన్ని రాసినదెవరు?

1. కెనడా 2. 662 3. 7 సంవత్సరాలకు 4. బంగారపు నిల్వలకు 5. 59 రోజులు 6. 1913లో 7. రజనీకాంత్ 8. ఆడపిల్లలంటే జంకు కలిగివుండటం 9 సీస్మాలజీ 10. ఒక సగటు సౌర సంవత్సరంలో కాంతి అటుప్రక్కనుంచి ఇటుప్రక్కకు పోగల దూరం 11. డెసిబెల్ 12. 82 1/2 డిగ్రీల తూర్పు రేఖాంశం 13. 6 సం. 14. రామానుజన్.

మద్యపానము, వీనిచే గలిగిన ఆయాసముపొందినవారును, కర్ణశూల, నేత్రరోగములు, మాతన జ్వరము, హృద్రోగము వీనిచే బాధలనందువారును దంతకాష్ఠముల నుపయోగింపక దంతచూర్ణముతోగానీ, టూత్ పేస్టులతోగాని దంతముల శుభ్రత గావించుకోవలయును.

దంతకాష్ఠములతో తోమినా, టూత్ బ్రష్‌లలో తోమినా సరియైన పద్ధతిలో చేయాలి. పైనుంచి క్రిందికి, క్రింది నుంచి పైకి, చిగుళ్ళకు బాధ కలుగకుండా, అన్నివైపులా తోమాలి. ఇలా చేస్తే పళ్ళమధ్య ఇరుక్కున్న ఆహార తునకలన్నీ పూర్తిగా వచ్చేస్తాయి. కొందరు రెండుసార్లు బ్రష్ చేసుకున్నవారికీ దంతరోగాలు వస్తున్నాయని వాపోతుంటారు. దీనికి కారణం వారు ఎక్కువసేపు దంతధావనం చేయటమే! ఇలా ఎక్కువసేపు చేయటంవలన దంతాలు కొంతకాలమునకు త్వరత్వరగా అరిగిపోవుట సంభవిస్తుంది. కాబట్టి అలా అతిగా చేయటంవలన కూడా హానికరమే.

ప్రతిరోజూ ఉదయం, రాత్రి భోజనానంతరం పరుండబోయేముందు దంతధావనం చేసుకోవాలి. భోజనానంతరం అనేకమార్లు నోటిని నీటితో పుక్కిలించి శుభ్రపరుచుకోవాలి.

ఇంకా దంతాలు శుభ్రంగా ఆరోగ్యంగా చిరకాలం బలంగా ఉండాలంటే ఆహార విషయంలోకూడ శ్రద్ధ వహించాలి. దంతాల అభివృద్ధికి కాల్షియం చాలా అవసరం. కాల్షియం ఎక్కువగాఉన్న పదార్థాలు (ఉదా: కోడిగుడ్డు, ఆకుకూరలు, జామకాయ, పళ్ళరసాలు) వాడితే పళ్ళబలానికి, అభివృద్ధికి మంచిది.

అతితీపి, అతి శీతలము, అతి పులుపుగా ఉండే పదార్థాలు తినరాదు. అవి పంటికి హాని కలుగజేస్తాయి. కిళ్ళీ వంటి ఘాటు పదార్థాలు కూడా వర్జించాలి. కిళ్ళీ, పొగాకు నమిలేవారి దంతాలకు గారపట్టి అసహ్యకరంగా తయారై అనేక దుష్పరిణామాలకు దారితీస్తుంది. ఎదుటివారికి దుర్వాసన కొడుతుంది. తద్వారా వారిపై ఉండే గౌరవభావం తొలగుతుంది. ఇలా పళ్ళకు గారపట్టినపుడు

దంతపై ద్యుతిచే "స్కేలింగ్" చేయించుకుని గా సాకులాట
గించుకోవాలి. కావున గార పట్టించే కిళ్ళీ వగైరా మును
మానివేయాలి. పళ్ళకు సంబంధించి పిప్పిపన్ను ను వచ్చి
తక్షణం "సిమ్మెంట్" చేయించుకోవాలి. ంచం

ఆయుర్వేదంలో దంతరోగాలకు సంబంధించిన చికిత్స వివరాలను కొన్నింటిని క్రింద వివరిస్తున్నాను.

నేరేడు పుల్లతో దంతధావన చేసిన కదలుచున్న దంతములు గట్టిపడును.

ఖర్జూర పుల్లతో దంతధావన చేసినచో దంతముల నొప్పి నివారణయగును.

పొగడచెట్టు బెరడును చూర్ణముగా చేసిగాని, దాని కట్టెలను కాల్చగా వచ్చిన బొగ్గుల పొడుముతోగాని దంతధావనం చేసికొన్నచో దంతములు దృఢపడును. దంత వ్యాధులు నివారణయగును.

మామిడాకుల కషాయము పుక్కిలించుచుండిన దంత రోగములన్నియు నివర్తించును.

వేపయిగుళ్ళు, చేదుపొట్ల, మామిడి, మర్రి, జువ్వి, మేడి, రావి, జాజికాయలు, ఆకులు సమభాగములు కషాయము పెట్టి తరువాత నోట పట్టి పుక్కిలించుచున్న దంతముల నొప్పులు మానును. నోటికి హితముగా నుండును.

నిమ్మరసం, తేనె, మాదీఫలరసం సమంగా చేర్చి పుప్పివంటిపై రాయవలెను. దురద, పోటు, వాపు హరించి పురుగులు చచ్చును.

కొడిశపాల, తక్కిలివేరు, చింతగింజలు, తెల్లవెంపలి వీనిలో ఏదైనను సరే పొడుము చేసి పండ్లు తోమిన కదలుట మాని గట్టిపడును.

తెల్లసుగంధిపాల ఆకు ముద్దగా నూరి ఆ ముద్దను పళ్ళ నడుమ అణచి పట్టినచో క్రిములు క్రింద పడిపోయి దంతములు గట్టిపడును.



గలుగవే గర్వోన్నతిన్ బొందరే, వారే రీ సిరిమూట గట్టు కొని పోవంజాలిరే భూమిపై" అని అంటాడు పోతన.

"కవుల కలాలు, గాయకుల కమ్మని కంఠములు ఈ శ్మశానపుం గగనుల ద్రొక్కి చూచెదిని ఒకానొకనాడు అల కాళిదాసు చరిత్రలు ఫల శరీరముల్ ప్రకృతి రంగమునం రేణువులయి మృత్తికం గలిసెనో కద" వున్నవారి ... వ. చివరికి ఎవరికైనా ఇదే గతి.

గౌరవింపబడు ... చే ప్రవృత్తి మాలాలి.

* చెప్పడంకంటే చేత మూల పాత్రయైన లింగరాజు వాత చెప్పాలి. గుపలుకులలో ఇదే భావాన్ని

* అపవాదులు అంటువ్యాధులు ... లకు చాలా హాని కలిగిస్తాయి, ... బ్రహ్మ

* డబ్బున్నవారు ఎలాంటి ఛలోక్తులు ... అందరూ చప్పట్లు కొడతారు.

* నీ గురించి నీవే చెప్పుకోకూడదు. మంచి చెప్పుకుంటే ఎవరూ నమ్మరు. చెడు చెప్పుకుంటే ఇంకా ఎంత చెడు వున్నదో ననుకుంటారు.

* పరిస్థితులు మనిషి అధీనంలో ఉండవు. కాని ప్రవర్తన మాత్రం అధీనంలో వుండాలి.

* దుర్మార్గుని హృదయం అతని వాక్కులో గోచరిస్తుంది. సన్మార్గుని వాక్కు అతని హృదయంలో ప్రస్ఫుటమవుతుంది.

* సత్యమునకై దేనినైనను సరే త్యజించవచ్చు; కాని దేనికొఱకైనను సరే సత్యమును మాత్రం త్యజింపరాదు.

* దుర్జనులకు హింసయే బలము. రాజులకు అధికారం బలం. స్త్రీలకు శుశ్రూష బలం. సద్గుణవంతులకు క్షమయే బలం.

# ఒక్కలు-సమాధా

, చిత్రాభ్యుదయము

1. ప్రపంచంలో కెల్లా రెండక్ష మొగవి వీరి రచనలు.
2. 100గ్రాముల కొబ్బరి ఎని
3. ఫ్రాన్స్ దేశాధ్యక్షుడిత ఆదరణ పొందిన నాటకం ఎన్నుకొంటారు? సజీవమై నిలిచివుంది. తదుపరి
4. USAలోని రచన వర విక్రయం. దీనిని 1922-23
5. తనచుట్చించారు. చింతామణి నాటకమును చూడని "వెలేదు. వరకట్న సమస్యను పరిష్కరించగలిన త డును లేదు. కాని ఈ రెండు నాటకాలు దుష్టాచార ములు నెలకొని వున్న సంఘానికి చురకలు వంటివి.

## గొల్లకోట సూర్యభాస్కరరావు

చింతామణి నాటకము వేశ్యా సంపర్కము వలన కలిగిన వ్యక్తి పతనావస్థను చిత్రించి నటువంటిది. వేశ్యా సంపర్కము వలన ఏర్పడే దుష్పరిణామాలను ఇంత వివేచన పూర్వకంగా చిత్రించిన రచన మరియొకటి లేదు.

చింతామణి నాటకంలో చింతామణి తల్లి శ్రీహరి, పోతనగారి భోగినీదండకంలో భోగినితల్లికి ఆచరణరూపం. సుబ్బిశెట్టి చింతామణి నాటకాంతంలో వున్న ఆస్తినంతా అమ్మి వృత్తి ధర్మాన్ని ఆశ్రయిస్తాడు. భోగినీదండకంలో కూడా భోగిని తల్లి, కూతురికి కులవృత్తి ధర్మాలు ఎన్నో బోధిస్తుంది. కాని నాయకుడు సింగ భూపాలుడు రాజు కాబట్టి బ్రతికి పోయాడు. చింతామణి తల్లి శ్రీహరి కూతురిచేత ఆచరణలో పెట్టించింది. నిజానికిది మనిషి పతనావస్థకు చెందిన సమస్య. కవి నాయకుణ్ణి ఉన్నతునిగా చిత్రించాలనుకుంటే తప్ప నారాయణరావుగారు చూపించిన పరిణామమే తథ్యం.

మద్యపా
కర్ణము
గము
గింప

# కాళ్ళకూరి

ము వేశ్యాలోలత్వమనేది మనిషిలో వున్న ఒక దుర్బలమైన మానసిక ప్రవృత్తి. దీనిలోని లోటును చెప్పడానికి వివేచన పూర్వకమైన రచన మిక్కిలి అవశ్యకము.

వీరు చూపిన ప్రతిఘటన వరకట్నానికి సంబంధించినది. గురజాడ కన్యాశుల్కం పేరుని బట్టి దీన్ని వరకట్నం పేరుతో సంబోధించవచ్చు. కాని కాళ్ళకూరి వరకట్న నామంతోవ్యవహరించలేదు.వరవిక్రయంగా సంబోధించారు. నిజానికిది సముచితమైన పేరే. ఈనాడు రాజ్యాంగంలో వేశ్యాలోలతకు గురియైన వ్యక్తికి వ్యభిచారి అనే పేరు పొందుపరిచారు. అలాగే అరవై యేళ్ళ క్రిందటే వరకట్న విషయంలో పురుషుణ్ణి వెల మగడు ఎందుకు కాదని నిలదీసారు కాళ్ళకూరి.

వెండి నాణెంబె పెనిమిటి వేశ్యకటులె
కట్నముల బార్య లిప్పటి కర్కశులకు
వేశ్య వెలయాలనంబడె వెలగ్రహించి
కట్నములచేత వెలమగల్ కారె వీరు

(ప్రథమాంకం)

ఈ వరకట్న సమస్యకు కులమతాలు కూడ ఉరిత్రాళ్ళ వంటివే. అన్నిటినీ మించినది డబ్బు. డబ్బుని ప్రతిఘటించినా కుల మతాలను కాదనలేక పోతున్నారు. ఆలోచనా సరళి అనేది మౌలిక సమస్య! విశ్వనాథవారు అంటారు; 10వ తరగతి చదివిన పిల్లకు కలెక్టరు భర్త అయితే, బి. యే. చదివిన పిల్లకు భూపతులు కావాలి. అందరూ భూపతులైనా అయ్యారు కాదని (విశ్వనాథ పంచశతి)

నిజానికిది సమస్య కాదు. దరిద్రులు దరిద్రులమధ్య కొట్లాట, పీకులాట. ధనవంతులు ధనవంతుల మధ్య ధన నిరూపణ. డబ్బు ప్రధాన అంశం అయితే, భోగలాలసత్వం ప్రధాన కారణం. ఆలోచనా సరళిలో లోపం. ఉన్నతిని

ప్రదర్శించుకోవడానికి ఎవరికి వారే ప్రాకులాట కారణాలు.

వర విక్రయం నాటకంలో కాళింది తన వివాహమును గూర్చి తల్లి అయిన భ్రమరాంబతో, కట్నమిచ్చి వివాహమును చేసుకొనే కంటే, వివాహము చేసుకోవడం మానెయ్యచ్చుగదా అని అంటుంది. అప్పుడు భ్రమరాంబ ఆలోచనను కాళ్ళకూరి చాల వాస్తవికంగా వివరించారు.

భ్రమరాంబ; అవివాహిత యగు నాడుబిడ్డ యింటను గల తల్లియవస్థ అమ్మా ! నీకిప్పుడేమి తెలియును.

సీ॥ 'పెరవారి పిల్లకు వరు డేరు పడెనన
మన పిల్లకెవ్వడో మగడటంచు
పరుల పిల్లల పెండ్లి పరికించునపుడెల్ల
మన పిల్లకెపుడో మనువటంచు
ఎదుట యింటికి నల్లుడే తెంచినపుడెల్ల
మన యల్లుడెపుడింట మసలుననుచు
పొరుగింటి పిల్ల కాపురము విన్నపుడెల్ల
మనపిల్ల కెట్టి దబ్బునో యటంచు'

పుట్టింది మొదలు కూతురికి పుస్తె కట్టేవరకూ, కూర్చున్నా, కునుకు తీసినా వృస్తిపడే ఆలోచనే వుంటుందని తల్లియైన భ్రమరాంబచేత పలికిస్తారు.

తల్లికి వుండే దిగులుగానే చెప్పవచ్చుగాని, ఇంకా ఎన్నో కోరికలు ఉంటాయి. ఈనాడు అల్లుడు గవర్నమెంటు ఉద్యోగమే చెయ్యాలి. అందులోను పెద్ద పీట అయితే మరీ మంచిది. భవనాలు, భూములు కావాలి. ఇటువంటి ఆలోచనలు అమితంగా నెలకొని వుంటాయి. ఇక భార్యతరపున పీడించి, తనయిల్లు పండించుకోవాలనేది మగవాడి ఆలోచన. పెళ్ళికాబోయే ఇద్దరికి డబ్బుమీదే దృష్టి. భోగలాలసత్వం మీదే మమకారం.

ఇటువంటి మనస్తత్వాలను ప్రణాళికలు, చట్టాలు మార్చలేవు. మనిషికి వ్యక్తిగతమైన టెంపర్‌మెంట్ ఉండాలి. జీవితంపై సమగ్ర అవగాహనకావాలి. ధనికుడికి ఇంకా ధనవంతుడిని కావాలనే కోరిక ఉంటుంది. ఈ దోపిడీ తత్త్వం మారాలి. "కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిన్ బొందరే ,వారే రీ సిరిమూట గట్టుకొని పోవంజాలిరే భూమిపై" అని అంటాడు పోతన. "కవుల కలాలు, గాయకుల కమ్మని కంఠములు ఈ శ్మశానపుం గవనుల ద్రొక్కి చూచెదిని ఒకానొకనాడు అల కాళిదాస భారవుల శరీరముల్ ప్రకృతి రంగము నందిపుడెంతలేసి రేణువులయి మృత్తికం గలిసెనో కద" అని అంటాడు జాషువ. చివరికి ఎవరికైనా ఇదే గతి. ఈ గతిని మరచి జీవించే ప్రవృత్తి మారాలి.

వరవిక్రయ నాటకంలో మూల పాత్రయైన లింగరాజు శింగరాజుచేత కాళ్ళకూరి తెలుగుపలుకులలో ఇదే భావాన్ని తొణికిస లాడిస్తారు.

" సంపద మహత్వ మెరుగని చవట బ్రహ్మ
చావులేకుండ గానేని సలుపడయ్యె
చచ్చునపుడు వెనువెంట సకల ధనము
తీసుకొని పోవు విధమేని తెలుపడయ్యె"

అయినా కొడుకు వివాహ విషయంలో వరకట్నంగా డబ్బు గుంజడానికి వెనుదీయడు.

మనిషిని ఆవరించుకొని వున్న కుల మతాల కంచు గోడలు పగలాలి. ప్రతి మనిషిలో స్వేచ్ఛాప్రవృత్తి నెలకొనాలి. అప్పటివరకు దుష్టసంప్రదాయాలు రూపు మారవు.

వరకట్న విషయంలో వివిధ వ్యక్తుల మనః ప్రవృత్తులు వరవిక్రయ నాటకంలో శక్తిమంతంగా చిత్రీకరించారు. వరకట్న సమస్య సమూలంగా నాశనం చేయడానికి కాళ్ళకూరి తన కలాన్ని కత్తిగా మార్చారు. కన్యాశుల్కం ఖంగుతింది. నేటికీ వరకట్న సమస్య పుట్టిపెరిగి ఇంతింతై వటుడింతయై అన్నట్లు దేదీప్యమానంగా వెలిగిపోతోంది. ఈ అంశం మీద వివేచనా పూర్వకమైన రచనలు రావాలి. అంద చందాలకు తావులేదు. ఈ అంశం మీద రచనలకు కాళ్ళకూరి మనకు ఆదర్శం.

" ఆధునికుడు ఒక జిరాఫీలా తయారవుతున్నాడు
రోజు రోజుకీ అతని మెదడుకీ హృదయానికీ
దూరం ఎక్కువై పోతోంది." (ఆరుద్ర) ★

# ప్రియ సంగమోత్సవ కథ

కుంతి మాటలను విని పరాశరుడు ఆమెతో, "ఓ కోడలా! నీవు యదార్థంగా ఉన్నదున్నట్టుగా చెప్పావు. నీయందు దోషమేమీ లేదు. సురలు ఇలా అద్భుత విషయాలను సమకూరుస్తారు. కర్ణునకలా అవవలసి ఉన్నది కనుక, ఆతణ్ణి నీవు ఏట విడచి పెట్టావు. నీకు కన్యాత్వహాని లేకపోవడం వల్ల కులాగ్రగణ్యవయావు. నీ చరిత్ర మంతా అమలిన మైనదనడానికి ఇసుమంత అయినా సందేహం లేదు !" అని ఆదరంతో పలికి, గాంధారితో ఇలా అన్నాడు.

## వడలి మందేశ్వరరావు

"నీవు నీ సుతులను, తోడబుట్టువులను నీవు కోరినట్టుగానే చూస్తావు. ఈ నీ చెలియలు కుంతి తన కొడుకు కర్ణుని చూస్తుంది. ద్రౌపది, సుభద్ర, మిగిలిన ఈ స్త్రీజనం అంతా అన్నదమ్ములను, పుత్రులను, మనుమలను కన్నులకు పండువుగా చూస్తారమ్మా! నే నిక్కడకు రావడం దీనిని నిర్వహించడానికే! మీ అందరి మనసులను వేదించే బెంగ నాకు తెలుసు. అందుకే మీరు ఇలా కోరారు. అలాగే చేస్తాను."

"నీ కొడుకులకు, మనుమలకు శోకింప వలసిన అవసర మేమాత్రమూ లేదు. వారు శూరులై రణంలో మరణాన్ని పొంది, స్వర్గలోక సుఖాన్ని పొందారు. ఓ గాంధారీ ! ఈ భారత యుద్ధం కోసమే మాననీయులైన దేవత లందరూ మానవులుగా అవతరించా రమ్మా !

"ఈ ధృతరాష్ట్ర మహారాజు ఎవరనుకున్నావు ? ఈయన ధృతరాష్ట్రుడనే మేటి గంధర్వుడు. మరుద్గణాంశతో జనించిన వాడు పాండురాజు. ఈ యుధిష్ఠిరుడు సాక్షాత్తూ ధర్మదేవతే ! పవనుడే భీముడై పుట్టాడు. నరుడనే మునే ఈ అర్జునుడు. సాక్షాత్తూ నారాయణుడు శ్రీకృష్ణుడన్న పేరును దాల్చి జన్మించాడు. నకుల సహదేవులు అశ్వనీ దేవతలమ్మా ! నీ తమ్ముడు శకుని ద్వాపరాంశతో జనించాడు; కలి సుయోధనుడయ్యాడు. రాక్షసులాతని తమ్ములుగా పుట్టారు.

"కర్ణుడే సూర్యుడు, అభిమన్యుడు చంద్రుడు; ఈ ద్రౌపది తోబుట్టువు ధృష్టద్యుమ్నుడు అగ్నిహోత్రుడు; అనిలుని అంశతో శిఖండి జన్మించాడు. అస్త్రగురువు ద్రోణాచార్యులు దేవగురువు బృహస్పతి అంశతో పుట్టినవాడమ్మా! భీష్ముడు వసువు అంశతో పుట్టాడు. అశ్వత్థామ రుద్రాంశతో పుట్టాడు.

"వీరే కాకుండా ఇంకా ఎంతో మంది దేవాసురుల అంశలతో జనించారు.

"అది అలా ఉండనీ మీ మనసున ఉన్న బెంగనంతా అపనయిస్తాను. మీరు నాతో గంగకు రండి. యుద్ధంలో తెగిన మీ బంధుకోటిని చూడగలుగుతారు."

ఇలా అంటూ వ్యాసుడు బయలు దేరడానికి లేవనే లేచాడు. ఓహో ! అనుకుంటూ, ఆహా! అనుకుంటూ, అందరి కేకలూ ఆకాశాన్ని అంటుతూండగా, ధృతరాష్ట్రుడూ, అక్కడ నున్నవారందరూ ఆ మహాత్ముని అనుసరించి బయలు దేరారు ; మునిజనం కూడా పరమాశ్చర్యాన్ని పొందుతూ, ఆ మహాత్మునితో గంగా నదీ సమీపానికి వెళ్ళారు,

ఇలా అక్కడ ఉన్న పౌర జనం, జానపదులు, మునిజనం అందరూ సాత్యవతేయుని వనుపున భాగీరథీ తీరాన విడిసారు. తాను చేయ బూనిన పనిని మరునాడు ఉదయానే చేయగలనన్నాడు పరాశరుడు. ఉత్సుకతతో

కుతకుతలాడిపోతూన్న ఆ జనానికి ఆ దినశేషము, ఆ రాత్రి నూరు సంవత్సరాలంత నిడివిగా తోచి, కాలం కదలిక లేక స్తబ్ధమైపోయినట్టుగా కనబడింది.

ఎట్టకేలకు సూర్యోదయ మయింది.

కాలోచిత కృత్యాలను నిర్వహించి, ధృతరాష్ట్రుడు, పాండు తనయులు, తపోధనులు, ఆ పరాశరుని దగ్గరకు వెళ్ళి, ఆయనను పరివేష్టించి ఉన్నారు. గాంధారీ, కుంతీ మొదలయిన ప్రముఖ స్త్రీ జనమంతా ఒక ప్రక్క ఆయనను కొలిచి ఉన్నారు. సర్వ జనులు ఆర్రు లెత్తికొని అలా అలా నిలబడి అద్భుత దర్శనానికి ఎదురుచూస్తూ, కదలిక మెదలిక లేక అలా ఉండిపోయారు.

సాత్యవతేయుడు జాహ్నవీ సలిలావగాహన మొన రించాడు. ప్రేమ మీరగా మృత వీరులందరినీ "ఇలా రండి!" అని తీయని గొంతుతో పిలువగా, ఏమిచెప్పాలి! నీటి యందొక శబ్దం బయలుదేరింది. రారాజు సుయోధనుడు, అతని తమ్ముళ్లు, కుమాళ్లు, అభిమన్యుడు, పాండవుల కుమాళ్లు, కర్ణుడు, బాహ్లికుడు, ద్రుపదుడు, మత్స్యపతి, వారి బంధువర్గము, శకుని, అతని తమ్ములు తనూజులు —— అందరూ భీష్ముని, ద్రోణాచార్యుని పురస్కరించుకొని, వాళ్లకెదురుగా కనబడ్డారు. వారందరూ దివ్యమైన మాల్యములను, అంబరాలను, భూషణాలను ధరించారు. దివ్యలేపనాలు వారి నెంతో అందగింపచేసాయి. వారందరూ తమ తమ మిత్రులతోనూ, భటులతోనూ, కనబడ్డారు.

పరాశరుడుధృతరాష్ట్రునికి ఆనాటికి దివ్యదృష్టినిచ్చాడు. ఆ మహాత్ముని లోకోత్తర ప్రభావానికి జనమంతాఆశ్చర్యపోయారు. ఈ అద్భుతాన్ని విన్న గాంధారి కూడా అవధి లేని ఆనందాన్ని పొంది తనకండ్ల కున్న పట్టాన్ని తొలగించింది.

అలా కనబడ్డ కురు వీరులందరూ నవ్వుతూ, పేలుతూ, పగలేక, స్నేహంగా ఉల్లాసంగా కనబడ్డారు. వారిలో మంచుకైనా అహంకారం కనబడ లేదు.

## నిజంగా పుట్టినట్లే...?

నీ ప్రాయం
నీ కాయం
నీ కోసమేననుకుంటే
నీతోనే ఖతం వాటి వునికి.
నువ్వొక గుబురు వృక్షమై - కానేపైనా
నీడనివ్వగలిగావంటే వ్యథార్తులకు
నువ్వు నిజంగా పుట్టినట్లే!
లేకుంటే కేవలం పుట్టి గిట్టినట్లే !!

— కమల్

"చతుర గంధర్వ అప్సరో జనులు గాన
ములఁ బ్రమోద మొనర్పంగఁ బొగడ వంది
సమితి విరహం కృతులు హృదయముల గౌర
వములు దెల్లంబు సేయంగ వచ్చి రొప్పి"

ఆశ్రమ 2-124

ఇలా వచ్చిన కురు వీరు లందరూ ఉచితమైన రీతిని ఒకరి నొకరు పలుకరించుకొని, సముచితాచారాలను నడుపుతూండగా, సకల బంధు జనానికీ కల్గిన ఆనందానికి అవధి లేకపోయింది.

ఆ రెండు పక్షాలలో తాతలు, గురువులు, శిష్యులు, తల్లులు, తండ్రులు, సోదరులు, కొడుకులు, కోడళ్ళు, మనుమలు, మరదులు, బావలు, వదినలు, మిత్రులు- అందరూ ఒకరినొకరు కలిసికొన్న సుఖాన్ని తనివితీర అనుభవిస్తూ, ఆనాడెల్ల యథేచ్ఛగా గడిపారు. ఆ వ్యాస భగవానుని మహిమను చూస్తూన్న జనమంతా అద్భుత రసంలో మునిగిపోయారు.

# మీకు తెలుసా?

మన దేశంలో సంతానోత్పత్తి ఎక్కువ. మన జనాభా రోజుకి 33000 చొప్పున పెరుగుతోందట.

చిన్న దేశమయినా అధిక సైన్యంగల దేశం ఇజ్రాయిల్. ఆ దేశంలోని జనాభాలో ఎక్కువ శాతం సైన్యంలోనే పనిచేస్తున్నారు.

ఒక చిన్న కథ రాసినందుకు ప్రపంచంలోనే ఎక్కువ పారితోషికం తీసుకున్న రచయిత ఎర్నెస్ట్‌హెమింగ్వే. "ది స్నో ఆఫ్ గిలీ" అనే కథకు ఆయనకు లభించిన పారితోషికం 25వేల డాలర్లు.

పేకముక్కలలో నలుగురు రాజులు, నలుగురు రాణులు ఉంటారు. వాళ్ళు - డేవిడ్, చార్లీ, అలెగ్జాండర్, జూలియస్ సీజర్ రాజులు; రాణులు - క్లియోపాత్రా, ఈస్తర్, షిబా, పౌడిసియా.

ప్రపంచమంతా ఉదయాన్ని AM అంటే ఫ్రెంచ్ వారు దాన్ని PM అంటారు.

షేక్స్పియర్ తెలివితేటలు తక్కువ. ఆయన పేరును 4000 పైగా రకరకాల స్పెల్లింగ్స్‌లో పలకవచ్చుట. ఆయనే తన పేరును రకరకాల స్పెల్లింగ్స్‌తో రాసుకునేవాడు

భారతదేశానికి తొలి "సర్వేయర్ జనరల్" గా పనిచేసిన బ్రిటిష్ ప్రముఖుడు జార్జ్ ఎవరెస్ట్ ఆయన గౌరవార్థం ఆ శిఖరానికి ఎవరెస్టు అనే పేరు పెట్టారు.

పత్రికలలో ధారావాహిక నవలలు ప్రచురించే సంప్రదాయాన్ని ప్రారంభించినవారు సుప్రసిద్ధ ఆంగ్లరచయిత చార్లెస్ డికెన్స్!

షేక్స్పియర్ ఏ నెల ఏ తేదీన పుట్టారో అదే నెలలో ఆ తేదీనే ఆయన తన 52వ ఏట మరణించారు. పుట్టిన తేదీ 23-4-1564 మరణించిన తేదీ 23-4-1616.

— జాగృతీ కిరణ్

మరునాడు ఉదయానే ఆ పరాశరుని మాటమీద ఇరుపక్షాలవారూ ఒకరికొకరు వీడ్కోలు చెప్పుకున్నారు. ఆ శూర జనం అంతా తాము ఏ లోకాలనుంచి ఇక్కడకు వచ్చారో అక్కడకు తిరుగుప్రయాణానికి సన్నద్ధు లయ్యారు. గంగలోకి ప్రవేశించారు. వ్యాస భగవానుడు వారిని అనుసరించి, గంగలో నిలబడి, పతులను అనుగమింపవలసిన అంగన లందరినీ రావలసిందిగా పిలిచాడు. భర్తలను కోల్పోయిన వీర భార్య లందరూ, ధృతరాష్ట్రి, గాంధారీ, కుంతీ, ధర్మనందనుల అనుజ్ఞను తీసికొని, భాగీరథీ నదిలో మునిగేసరికి వారికి మానుష దేహాలు డుల్లిపోయాయి; దేవ తనువులను ధరించారు. దివ్యాలంకారాలను దాల్చి, తేజోమూర్తులై తమ తమ మగలను చేరుకున్నారు.

"అవ్విశేషంబు సూచి సర్వజనులు సత్యం తాశ్చర్య సంతోషాధీన మానసు లైరి!"

ఈ ప్రియ సంగమోత్సవ కథ భారతం మొత్తంమీదే అద్భుత రసాన్ని కల్గించే అపూర్వమైన సన్నివేశం. దీన్ని ఘటించినవాడు వ్యాస భగవానుడు ఆయన ఎంతటి కవో, ఎంతటి క్రాంతి దర్శో, తపస్సువల్ల అంతటి అద్భుత విషయాన్ని సమకూర్చగల, అతిమానుషశక్తిని ప్రదర్శించగల సమర్థుడు. ఆయన మృతవీరులను చూపడం వల్ల అటు ధృతరాష్ట్రునికీ, గాంధారికీ, కుంతికీ మాత్రమే కాక, ఇటు పాండవులందరికీ కూడా ఒక పెద్ద బెంగ తీరింది. తమ హితులూ, బంధువులూ చనిపోతే మాత్రం ఏమయిపోతారు. మనకు కాస్త దవ్వున మరో లోకంలో ఉంటారేమో ! మరణమన్నది ఇంతకన్న దివ్యమైన మరో జీవితానికి ప్రారంభమేమో! దానికోసం అంత వగవ నవసరం లేదు- అని వారందరికీ అనిపించి ఉండాలి. మృతవీరులు ప్రత్యక్షంగా కనబడేసరికి అందరి బెంగా తీరడమే కాదు, వారూ ఈ తనువును తృప్తిగా విడవడానికి మానసికంగా సన్నద్ధులయ్యారు. ధృతరాష్ట్రాదులకు మోహం విచ్చిపోయింది, మనసుకు స్వాస్థ్యం కల్గింది. 

# దూరపు కొండలు....

— కుమారి నందివాడ సుబ్బలక్ష్మి

"అర్థమయిందా ? వెకిలిగా మాట్లాడినట్లు తెలిసిందా, ఇంటికి రాగానే మీ పనిపడతా ! జాగ్రత్త !!"

**మా శ్రీమతి పిల్లలిద్దరిని హెచ్చరిస్తోంది. ప్రయాణమవుతున్న దగ్గర్నుంచి ఈ జాగ్రత్తలు, హెచ్చరికలు నాకు వినిపిస్తూనే వున్నాయి.**

నా చిన్ననాటి స్నేహితుడు ప్రసాద్, ఉద్యోగరీత్యా మైసూర్‌లో వుంటున్నాడు. ట్రాన్స్‌ఫర్ మీద విజయవాడ వచ్చామని వ్రాశాడు. చూసిరావటానికి వెళుతున్నాం.

ప్రసాద్‌కి ఇద్దరు మగపిల్లలు. ఉత్తరాలలో ఎప్పుడూ వాళ్ళపిల్లల గురించే వ్రాస్తూ వుంటాడు. ఏడాది క్రితం మా ఇంటికి వచ్చి రెండు రోజులున్నాడు ప్రసాద్. వాడి మాటల్లో వాడి పెద్దకొడుకు అశ్వంత్ అద్భుతమైన తెలివితేటలు గలవాడని అర్థమయింది. స్కూల్‌లో "క్విజ్" పోటీలలో ఎప్పుడూ అశ్వంత్‌దే ఫస్టట. రాష్ట్ర స్థాయిలో కూడ ఒకసారి పాల్గొన్నాడుట. ఏ దేశపు రాజధాని ఏదో, ఆ దేశ ప్రధానమంత్రి ఎవరో, నిద్రలో లేపి అడిగినా చెపుతాడట. ఏ ఆటగాడు, ఏ ఆటలో ప్రసిద్ధో నాలుక చివరే వుంటుందిట.

"నిజంగా, రాజా! వాడి జనరల్ నాలెడ్జ్ ముందు మన మెందుకు పనికి రా మనుకో. ప్రపంచ విషయాలన్నీ వాడికి తెలుసు" అని ఎంతో గర్వంగా నాతో అన్నాడు ప్రసాద్.

వాడు వచ్చి వెళ్ళిన దగ్గర్నుంచి నా శ్రీమతి మా పిల్లలు మోరియా, మైత్రేయిలనిద్దర్నీ వేపుకు తింటోంది. "మీకు అల్లరి తప్ప ఏమీలేదు. అశ్వంత్‌ని చూడండి. ఎన్నో బహుమతులొస్తాయట. మీరంతా "అయ్యే" పోలికయ్యే. మీకెక్కడి నుంచి వస్తాయి తెలివి తేటలు?" అంటూ నా మీదకు కూడ విసురుతోంది బాణాలు.

ప్రసాద్ వాళ్ళు విజయవాడ వచ్చారన్న దగ్గర్నుంచి, అక్కడికి వెళ్ళటానికి తొందర పడుతోంది. వాళ్ళపిల్లలను చూడాలన్న కుతూహలంతో, తీరా ప్రయాణం అన్న దగ్గర్నుంచి ఒక విధమైన "ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సు"తో బాధపడుతోంది. ప్రసాద్ పిల్లల ముందు తన పిల్లలు తెలివి తక్కువగా వుంటారేమో! అని వాళ్ళకి ఎన్నో జాగ్రత్తలు చెపుతోంది.

"ఈ రోజు ప్రయాణం వుందా? లేదా!" అన్నాను విసుగ్గా. పిల్లల్ని తీసుకొని బయటకు వచ్చి, తాళం వేసింది. స్కూటర్ స్టార్ట్ చేశాను.

"హలో! రండి ' ఆహ్వానించారు ప్రసాద్ దంపతులు. భార్యని, పిల్లల్ని పరిచయం చేశాడు. అశ్వంత్ తొమ్మిది, అనిల్ ఏడవతరగతి చదువుతున్నారు. ఇద్దరు చక్కగా వున్నారు. మా వాళ్ళని వాళ్ళకు పరిచయం చేశాను. మా వాడు మోరియా ఎనిమిది, అమ్మాయి మైత్రేయి ఐదవ తరగతి చదువుతున్నారు.

## సెక్యులర్ స్టేట్

ప్రతిభ కు శిరోముండనం
కులం కు సింహాసనం
ధనాని కి పెద్దరికం
పెద్దవారి కి పేరటిగుమ్మం
పేద కు మొండిచెయ్యి
పేరుకు మాత్రం
మనది 'సెక్యులర్' స్టేట్.

— యర్రగుంట్లపాటి శేషగిరిరావు

"కమాన్! నా రూమ్‌కి రండి" అని అశ్వంత్ పిల్లల్ని తన వెంట తీసుకు వెళ్ళాడు.

భోజనాలు ఇంటి దగ్గర పూర్తిచేశాం కనుక తీరిగ్గా కూర్చుని కబుర్లు చెప్పుకొంటున్నాం. లోపల నుంచి పిల్లల మాటలు వినిపిస్తూనే వున్నాయి.

మోరియా బిక్కమొహంతో నా దగ్గరకు వచ్చి "నాన్నా! జింబాబ్వే యొక్క పాత పేరుట ఏమిటి? నాకు తెలియలేదని అశ్వంత్ ఏడిపిస్తున్నాడు" అన్నాడు. నిజం చెప్పాలంటే జింబాబ్వే అనేది దేశం పేరని కూడ మా వాడికి తెలియదు. మా వాడు ఫస్ట్ క్లాస్ స్టూడెంట్. కాని అందరూ గొప్పగా భావించే ప్రపంచస్థాయి జనరల్ నాలెడ్జ్ విషయంలో సాధారణంగా వుంటాడు. దానికి ఒక రకంగా నేనే కారణం. మా పిల్లలకు చిన్న కథల వంటి బాలసాహిత్యపుస్తకాలు కొని, తీరిగ్గా వున్నప్పుడు చదివిస్తాను. నా ఉద్దేశం 'జనరల్ నాలెడ్జ్' అనేది నెమ్మదిగా, వాళ్ళంతట వాళ్ళుగా తెలుసుకోవాలి గాని, దానిని ఒక ప్రత్యేక 'సబ్జెక్టు'గా భావించి, పుస్తకాలు బట్టీ వేయించటం ద్వారా రాదని.

నా అభిప్రాయాలు మా ఆవిడకు ఛాదస్తంగా, ఫూలిష్‌గా కనిపిస్తాయి.

"వాట్ హాపెండ్ మోరియా?" అడిగాడు ప్రసాద్. "ఏమీ లేదు". అని "అలా బిక్కమొహం వేయకూడదు. నీకు తెలియనివి అశ్వంత్ నడిగి తెలుసుకో. వెళ్ళు!" అంటుండగా చప్పట్లు కొడుతూ, పెద్దగా నవ్వుతూ "హె, హె, హె." అని అరుస్తూ మా పాప గంతులేస్తూ వచ్చింది. వెనకాల అనిల్, అశ్వంత్ లిద్దరూ కోపంగా వచ్చారు.

"డాడీ! ష్ ఈజ్ ఇన్‌సల్టింగ్ మి" అశ్వంత్ ఉక్రోషంగా అన్నాడు.

"ఏయ్; హె, హె— హోయ్! ఏం తెలీదు. అన్నా! వీళ్ళకేం తెలియదు." అంటూ వాళ్ళవంక చూసి నవ్వుతోంది మా సిసింద్రీ. "ఏమిటి మైత్రేయి! అల్లరి?" గద్దించింది

"అమ్మా; అశ్వంత్ వాళ్ళకేమీ రావు. నిజం! అన్నయ్యకి అదేదో తెలియదని నవ్వారా! అందుకని నేనేమొ; 'శ్రీరాముని పెద్ద తమ్ముడెవరు?' అని అడిగాను. అనిల్‌కేమో తెలియదుట. అశ్వంతేమో, "లక్ష్మణుడు" అని చెప్పాడు." ఏయ్! లక్ష్మణుడట అని ఎగతాళిగా నవ్వుతూ ఎగురుతోంది. పాపా! అనిపిల్చాను. నా దగ్గరకు వచ్చి, "నాన్నా! పోనీ శ్రీరాముని అన్నదమ్ములలో కవలపిల్లలు ఎవ్వరు? అన్నాను.

'భరతుడు, శత్రుఘ్నుడు' అంటున్నారు.

షేమ్, షేమ్! అది కూడ తెలియదు వాళ్ళకి. "హె, హె," అని నవ్వుతుంటే చెల్లితో అన్న కూడ జత కలిపాడు.

"తప్పు! అలా నవ్వకూడదు". అంటూ ఇద్దరిని దగ్గరికి తీసుకొని తృప్తిగా గాలిపీలుస్తూ మా ఆవిడ వంక చూశాను. "ఈ దేశపు పిల్లలు వీళ్ళు. నా ఆశయాలతో రూపుదిద్దుకొన్న నా పిల్లలు" అన్న భావనతో నా మనస్సు ఉప్పొంగింది.



# భారతీయ సంస్కృతి - విద్య

మనిషికి కావలసింది శాంతి. శాంతి లేక సుఖం లేదు కదా ! ఈ శాంతిని పొందటం కోసం మనిషి అనాదిగా ప్రయత్న శీలుడై ఉన్నాడు; కాని ఎందుకోమరి దాన్ని పొందలేక పోతున్నాడు. మనసు దేని ద్వారా తృప్తిపడు తుందో నన్న విషయాన్ని గూర్చి అన్వేషించాడు ఫలితంగా తనకు ప్రకృతి ప్రసాదించిన పంచేంద్రియాలను కనుగొన్నాడు. కన్ను రూపాన్ని చూస్తే, చెవి శబ్దాన్ని వింటే, జిహ్వ రుచులను గ్రహిస్తే, ముక్కు వాసనలను చూస్తే, చర్మం స్పర్శను పొందితే—మనసు తృప్తి పడటం గమనించాడు. ఈ ఐదింటికి మించిన ఇంద్రియాలు అతనికి మరేమీ గోచరించ లేదు. కనుక మనసును తృప్తిపరచాలంటే ఈ ఐదు ఇంద్రియాలకు తగిన విషయాలను అందించాలనుకున్నాడు; అందించటం ప్రారంభించాడు. కానీ పూర్తిగా సఫలీ కృతుడు కాలేకపోయాడు.

మనసు కేవలం ఇంద్రియసుఖాలనుభవించటంతో తృప్తి చెందటం లేదన్నది తెలిసి వచ్చింది. మనసుకు సున్నిత మైన-కోమలమైన-మృదువైన-అత్యంత ఆకర్షణీయమైన-క్రొత్తదైన - తాజాదైన అందమైన విషయాలే నచ్చు తాయన్నది తెలిసి వచ్చింది. అందమైన, ఆకర్షణీయమైన రూపంకావాలి, మృదువైన సొంపైన శబ్దం కావాలి, చక్కనైన సువాసనలు కావాలి, వెచ్చని మెత్తని స్పర్శలుకావాలి, రుచికరమైన మధుర పదార్థాలు కావాలి - ఇలా విషయాలను అనుభవించి తృప్తి పడటంలో కూడా, మనసు తన కంటూ కొన్ని సూత్రాలను ఏర్పాటు చేసుకున్నది. ఆ సూత్రాల కనుగుణంగా మనిషి దానికి ఇంద్రియ విషయాలను అందించ వలసి వచ్చింది. అలా అందించినప్పటికీ మనసుకు ఇంకా తృప్తి కలగలేదు.

ప్రకృతిలో సహజంగా ఏర్పడిన స్త్రీ పురుష విభజన వైపు మనసు దృష్టిపోయింది. స్త్రీ మనసు పురుషుని వైపు పురుషుని మనసు స్త్రీ వైపువెళ్లింది.ఆ ఇద్దరూ పరస్పరం చూసుకుని,పలకరించుకుని,ముట్టుకుని-అంటుకుని,వాసనలు చూసుకుని, రుచులు గ్రహించుకుని - ఎంతో సుఖాన్ని అనుభవించారు. తమ పరస్పర కలియికలో సర్వేంద్రియాలను తృప్తిపరిచే సుఖముందన్న భ్రమలో పడిపోయారు. అంతేకాక ఆ ఇరువురి కలయికలో మరొక అదనపుసుఖం కూడా లభించింది; అదే స్త్రీ-పురుష సంభోగ సుఖం. ఈ సంభోగ సుఖం మహదానందంగా అనిపించింది. సర్వేంద్రియాల సుఖం,ఈ సంభోగసుఖంలో లయమైపోతున్నట్లు భ్రమకలిగింది. మనసు, ఈ సంభోగ సుఖం ద్వారా పూర్ణ తృప్తిని పొందుతున్నట్లు భ్రాంతిపడింది. దానితో మనుష లకు - స్త్రీ పురుషులకు ఈ సంభోగమనే కామసుఖం అత్యంత ప్రధానమైపోయింది.

ఓం ప్రకాశ్

ఇది మనిషి 'శాంతి' అన్వేషణ యాత్రలో ఒకభాగం. దీని తర్వాత నున్న భాగం చాలా గణనీయమైనది, కత్తి మొనపై నడకలాంటిది. తర్వాత భాగం గూర్చి చాలా కాలం వరకు మనిషి ఆలోచించ లేకపోయాడు. మొదటి భాగమే గమ్యం అని తాను సంపూర్ణ శాంతిని పొందానని తలచి, అక్కడితో ఆగిపోయాడు; అది ఒక మజిలీ అన్న సత్యం అతను గ్రహించలేక, శాశ్వతంగా విశ్రమించాడు.

దీనినే మన భారతీయ సంస్కృతి 'అభ్యుదయం' అని పేర్కొంటుంది. బాహ్య విషయాల సుఖాలపై మనసును తృప్తి పరిచే ప్రయత్నాల నన్నింటిని "అభ్యుదయం" అనే పేరున వ్యవహరిస్తుంది. దీనినే ఇహలోక సుఖం - స్వర్గభోగం - భోగమయ జీవితం-లౌకిక శాంతి అంటూ అనేకంగా మనం చెప్పుకుంటాం. భారతీయ సంస్కృతి తప్ప ఇతర పాశ్చాత్య సంస్కృతులన్నీ దాదాపు ఈ

## శోకభారతి

నేడు
భారతమాత
నిరంతరాశ్రునయన.
ఆమె హృదయంలో ఆరని వేదన
ఆమె మేధస్సులో ఎడతెగని ఆలోచన
రేపేమిటన్నది ఆమెను వేధిస్తున్న ప్రశ్న
ఆమె గుండె చెరువై విలపిస్తోన్న
శోకోద్విగ్న.

ఆలయాలముందు
సోదరుల రక్తంతో కలయంపి చల్లుతున్న
కన్నయ్యల అమానుషాన్ని చూడలేక
నిత్యం నేలకొరుగుతున్న అమాయకుల
నిష్కారణ బలిదానానికి తాళలేక
అనునిత్యం రగులుతున్న చితుల్ని
చిదుకుతున్న బ్రతుకుల్ని చూడలేక
అదే పనిగా చెలరేగుతున్న భయంకర
విషజ్వాలల్ని సహించలేక
అమ్మ దుఃఖిస్తోంది.

తమ్ముడూ!
ఒక్కసారి అమ్మ ముఖంలోకి చూడు
పుట్టెడు దుఃఖంతో
ఆమె నిరంతరాశ్రునయన
ఆమె హృదయంలో ఆరని వేదన
ఆగని హింసకు అంతమెక్కడున్నది
ఆమెను వేధిస్తున్న ప్రశ్న
ఆమె గుండె చెరువై విలపిస్తోన్న
శోకోద్విగ్న.

— తిరునగరి

అభ్యుదయాన్నే తమ చరమధ్యేయంగా ఎంచుకుని, తమ జీవితాలను తదనుగుణంగా మలచుకున్నాయి. ఇప్పటికీ విదేశీ సంస్కృతుల లక్ష్యం కేవలం ఈ లౌకికభోగమయమైన అభ్యుదయమే. అంతకు మించిన సుఖశాంతులుంటాయన్న ఆలోచనకు కూడా అవి తావివ్వవు. ఎందుకంటే శరీరం ద్వారా గ్రహించే సుఖశాంతులు – ఇంతటితో ఆగిపోతాయి. వాటి క్షేత్రపరిధి ఇంతకుమించి విస్తరించదు.

"ఈ అభ్యుదయ" సుఖశాంతులను పొందే ప్రయత్నంలో, మనిషి తనకు తెలియకుండగానే ఎంతో పతనమైపోయాడు. ముందుగా మనిషిలో అహం పెరిగి స్వార్థం విజృంభించింది. తన మనసును తృప్తి పరిచే ప్రయత్నంలో ఏమైనా చేయటానికి, ఏమైనా కావటానికి సిద్ధపడ్డాడు. మోసాలు–వంచనలు–హింసలు–హత్యలు — నటనలు–దొంగతనాలు–దోపిడీలు–అనృతాలు అపమార్గాలు–ఒకటేమిటీ ఏదివీలుగా ఉంటే దాన్ని అనుసరించి మనసును తృప్తిపరచసాగాడు. తన మనసు కోరిన స్త్రీని–ఆమె ఎవరైనాసరే, భార్య–మరదలు–చెల్లెలు–వదిన–కూతురు – పరసతి–గురుపత్ని – కన్య–బాల–కుమారి–ఆమెకిష్టం ఉన్నా లేకపోయినా సరె బలవంతంగానో, అనుకూలంచేసుకునో అనుభవించసాగాడు. స్త్రీ సైతం తన కామ తృప్తికై, పరపురుషులను మరిగింది. తాను కోరిన పురుషుని పొందుకోసం ఏమైనా చేయటానికి, ఎంతకైనా తెగించటానికి సంసిద్ధురాలయింది. ఇలా మనిషి తన విషయ సుఖాలకోసం దిగజారిపోయాడు. పశువుకన్నా–జంతువుకన్నా–మృగం కన్నా హీనంగా పతనమైపోయాడు. అతనిలోని స్వార్థం బుసబుసకొట్టి–కామాన్ని, క్రోధాన్ని, లోభాన్ని, ద్వేషాన్ని, మోహాన్ని, మదాన్ని, ఈర్ష్యను వెళ్ళగక్కి పిచ్చిగా కాటువేయసాగింది. తద్వారా మనిషి–మనిషికి మధ్యనున్న మానవతా సంబంధాలు దగ్ధమైపోయాయి. మనిషి, తన స్వశాంతికోసం, ఎదుటి మనిషి శాంతిసుఖాలను అపహరించటంతో, మనుషులకెవ్వరికీ శాంతి సుఖం లేకుండా పోయాయి. మనిషి పిచ్చిగా అశాంతితో అలమటించసాగాడు. అంతర్గతంగా కృశించిపోసాగాడు. భార్యాభర్తల సంబంధాలు, తల్లీ

కూతుళ్ల సంబంధాలు, తండ్రీ కొడుకుల సంబంధాలు, అన్నదమ్ముల సంబంధాలు, ఇరుగుపొరుగు సంబంధాలు-అన్నీ ఈ స్వార్థపు సుఖసాధనలమూలంగా దెబ్బతిన్నాయి. కుటుంబ జీవితంలో, సమాజ జీవితంలో, దేశీయపరమైన జీవితంలో మనిషికి సంఘర్షణలు-అశాంతులే శేషించిపోయాయి. దీనికి కారణమేమిటో పాశ్చాత్యసంస్కృతులు ఇంతవరకూ స్పష్టంగా కనిపెట్టలేక పోయాయి. వారు మనిషి అశాంతికి మూలకారణమైన స్వార్థాన్ని-అహాన్ని పూర్తిగా రూపుమాపేందుకు ముందుకు రా సాహసించలేదు. వారు కేవలం వాటికి కొన్నిమితులు - పరిమితులు-నియమాలు సూత్రాలు-హద్దులు ఏర్పరిచారు. తద్వారా సమస్యను పరిష్కరించుకోదలిచారు. పైకి ఒక విధంగా, లోన ఒక విధంగా నటిస్తూ కృత్రిమ జీవితాలను గడపటానికి పూనుకున్నారు. కాని గరళం, అది ఒక చుక్కఅయినాసరే, దాని ప్రభావం చూపనే చూపుతుంది. కాచిన పాలలో ఒక చుక్క పెరుగు వేసినా, పాలు విరిగిపోక మానవుకదా! అలాగే ఈ పాశ్చాత్య సంస్కృతి స్వార్థాన్ని సమూలంగా నాశనం చేయకపోవటం వల్ల, మనిషిలో అశాంతిని ఇంకా పెంచివేసింది.

ఇక్కడ మన భారతీయ సంస్కృతి అసలు సంస్కృతి ప్రారంభమౌతుంది. శాంతి సాధనలో అసలు ప్రారంభం భారతీయ సంస్కృతి ఇక్కడి నుండే కొనసాగిస్తుంది. "అభ్యుదయం" కేవలం పడవను ప్రవాహంలోకి వంపే దారి లాంటిదే. నిజమైన నదీ ప్రయాణం ఆ తర్వాతే జరుగుతుంది. భారతీయ సంస్కృతి, మనిషికి శాంతి ఎక్కడ-ఎలా-ఎందుకు లభిస్తుందో క్షుణ్ణంగా అధ్యయనం చేసి, దానికోసం జనుల జీవితవిధానాలను రూపొందించింది. మనసును విషయాలతో తృప్తిపరచటం కాదు, మనసును





నామరూపాలు లేకుండా సంహరించి వేయటం ద్వారానే మనిషికి సహజసిద్ధమైఉన్న శాంతి ఆనందాలు అనుభూతమౌతాయని గ్రహించి, ఘోషించి, చాటించిమరీ చెప్పింది. అందుకే భారతీయుల జీవితాలలో జన్మ మొదలు మరణపర్యంతరం ఈ మనసును అంటే అహం స్వార్థాలను నాశనంచేసే విధానాలే మనకుగోచరిస్తాయి. ఈ విధానాలను పూర్తిగా స్వీకరించినవారిని, అలా జీవిస్తున్న వారిని ఈ సంస్కృతి పూజించి, నమస్కరించి, "ద్విజులు" అని సన్మానిస్తుంది. వారిలో "శాంతి"ని ప్రత్యక్షంగా దర్శించి, కీర్తిస్తుంది. దీనినే మన భారతీయ సంస్కృతి "నిశ్శ్రేయస్సు" అని శ్రేయోమార్గం-ఆత్మసుఖం-మోక్షం అంటూ కొనియాడుతుంది.

నేటి విద్య కేవలం పైన చెప్పిన అభ్యుదయసాధనకే అంటే అశాంతినిచ్చే స్వార్థసాధనకే పరిమితమైపోయింది. కాని విద్య నిజంగా సాధించవలసింది ఈ నిశ్శ్రేయస్సునే.

***

క థా ని క

# ఏకాత్మ

వ్రాలమలా ఎండ మాడిపోతుండగా మిల మిలా మెరుస్తున్న అద్దాలతో మెటల్‌రోడ్డుమీద దుమ్మురేపు కుంటూ బస్సు పోతోంది. మిరపకాయల బస్తాలోనైనా కొంత ఖాళీ ఉంటుందేమోగాని. ఆ బస్సులో మాత్రం ఖాళీ శూన్యం. మనిషి మనిషి కరుచుకొని నిలబడ్డారు, కండక్టరు మాత్రం ఎలా వస్తున్నాడోకాని వారి మధ్య ఖాళీ చేసుకుంటూ టిక్కెట్లిస్తూ చక్రం తిప్పుతున్నాడు. నిత్యకృత్యంలో మహానిష్ణాతుడు. ఆ ప్రైవేటు బస్సులో అతను చేసే బాధామయ కృషీవలత్వానికి, "కార్మికరత్న" బిరుదివ్వ వచ్చనిపించింది. పసిపిల్లలు, ఆడవాళ్ళు, వృద్ధులుకూడ నించొని ఆ గతుకుల రోడ్డులో బస్సుకుదుపులకు తట్టుకుంటూ ప్రయాణం చేస్తున్నారు.

## వజ్రాయుధ

ఆమె ! పాపం పసిపిల్ల నెత్తికొని నిలబడి ఉంది, 30 లోపు వయసుంటుంది. నిలబడటానికైనా చోటులేక ఒక చేత్తో జారిపోతున్న పాపను పైకెత్తుకుంటూ రెండో చేత్తో బస్‌రాడ్ పట్టుకుని నిల్చునిఉన్నది.

సుదర్శనం హృదయం వేదనతో నిండింది. ఆమెకు ఎవరైనా చోటిస్తే బాగుండును. గత అరగంట నుండి ఆమె అలా నిలబడే ఉంది. ఎవరో ఎందుకు? తనే సీటివ్వకూడదా ? తను మగవాళ్ళ సీట్లో ఉన్నాడు. తనతో పాటు ఇంకొకరు కూడా లేవాలి. ఆమె పరాయి మగవాని ప్రక్కన కూర్చుంటుందా ? ఎంతైనా భారతీయ మహిళ కదా !

ఆడవారి సీట్లో భార్యప్రక్కన కూర్చున్న భర్త కాబోలు కబుర్లతో కులాసా కాలక్షేపం చేస్తున్నాడేకాని అర్ధ్రహృదయంలో ఆడకూతురుకు సీటివ్వలేదు. ప్రక్కన ఎవరూ సలహా కూడ ఇవ్వలేదు. ఎవరికివారే యమునా తీరేగా సతమతమౌతున్నారు.

ఇంకా ఎంతసేపు నిలువుజీతంతో ఉండాలో ఆమె ! బాధపడుతున్నాడు సుదర్శనం. పాప కూడ ఏడిపిస్తున్నది. ఆమె నీరసంగా ఉన్నట్లుంది.

తనకెందుకో ఆమె నుంచుంటే బాధ - ఆమె తనకు ఏమీ సంబంధించింది కాదే ! ఏ సంబంధం లేకపోయినా ఏమిటో బాధగానే ఉంది. బంధుతా లేదు. పరిచయమూ లేదు.

ఇంతలో ఊరొకటి వచ్చింది. అక్కడ ప్రక్కన పసిపిల్ల తల్లి బాధపడుతున్నా చూసి జాలి చెందని దంపతులు దిగిపోయారు హడావుడిగా! ఆ పిల్లతల్లి, ఇంకో స్త్రీకూడా సీట్లో కూర్చున్నారు.

సుదర్శనం హృదయం తేలికపడింది. అమ్మయ్య ! ఆమె కూర్చుంది. ఒక సంతృప్తి. ఇందాక విచారం ఎందుకో, ఇప్పుడానందం ఎందుకో అతనికే తెలీదు.

మళ్ళీ బస్సు కదిలింది. ఆ నాటు రోడ్డులో బస్సు వేగంగా పోతుంటే అంతకంటే వేగంగా దుమ్ము లేచి పగబట్టినట్లుగా వారిపై బడుతోంది.

కాస్త బస్సులో రద్దీ తగ్గడంతో పేపరు తీసి చదవడం మొదలెట్టాడు సుదర్శనం. పేపరునిండా హింస, దుర్మార్గాలు, అత్యాచారాలు దండ గ్రుచ్చినట్లున్నాయి. పంజాబులో హత్యాకాండ, త్రిపురలో హత్యలు, గూర్ఖాలాండ్ కోసం హింస, ప్రతిహింసలు, ఈశాన్యభారతంలో అల్లకల్లోలం, మిజోరం ఒప్పందంతో ఒకప్పుడు దేశద్రోహులుగా ముద్రపడినవారు అధికార పీఠాలధిష్టించడం, ఇంకో పేజీలో ఆరు సంవత్సరాల పసిపిల్లను మానభంగం మానవరూప రాక్షసుని అరెస్టు చేసిన వార్త

లాకప్ మరణాలు, బ్యాంకు లూటీలు, అవినీతి కుంభ కోణాలు వగైరా!

పేపరు చూసినా హృదయం ఉడికిపోయింది. చివరి పేజీలో పాకిస్తాన్‌పై హాకీలో భారత్ విజయవార్త చీకటిలో వెలుగులా కాస్తంత రిలీఫ్ యిచ్చింది. మనం హాకీ ఆడలేకపోయినా, మన ఆటగాళ్ళు ఇంకో దేశంపై విజయం సాధించారంటే ఏదో ఊరట.

ఏమిటో మానవ మనస్తత్వం! మన ఎదుట మంచి జరిగితే ఆనందం. చెడు విన్నా బాధ. అందరూ అంతేనా దాదాపు అంతే. కొందరు మాత్రం శల్యహృదయులుండొచ్చు. లేకపోతే ఇన్ని దురాగతాలు జరుగవుగా. సగటు మనుషులంతా యింతే! ఇక్కడ ఉప్పెనలో ప్రాణాలు పోతే, ప్రజలు అష్టకష్టాల పాలైతే ఆ సేతు హిమాచలం నుండీ, ప్రపంచం నలుమూలలనుండీ విరాళాలు, వస్తువులు పంపారు. శవాలను మట్టి చేసారు. ఆర్తులకు బట్టలు యిచ్చారు. గృహాలు కట్టించారు. వైద్యం చేయించారు. బక్కరైతుల పొలాలకు మందులందించారు. గ్రామాలను పునర్నిర్మాణం చేసారు, చితికిపోయిన జీవితాల్లో దీపాలను వెలిగించారు. ఈ మనుషులను వాళ్ళెప్పుడూ చూడనూ లేదు. వీళ్ళు వాళ్ళకేమీ ప్రత్యుపకారం చెయ్యరు. ప్రమాదాలు ఎదురైనపుడు తోటి ప్రాణులు బాధలో ఉంటే అందరి ప్రతిస్పందనా ఒకటేనేమో! నేను లోనే మనముందని అందరికీ తెలుసు. కానీ అది ఎప్పుడూ గుర్తుండదు.

ఆ అద్వైతం శాశ్వతమైతే సమస్యలే ఉండవు. ప్రమాదాలు, ప్రళయాలు, ఉత్పాతాలు వస్తేనేనా మానవునిలో మానవుడు మాధవుడయ్యేది. ఆ సద్బుద్ధి, ఆర్ద్రత, సానుభూతి నిత్యజీవితంలోఏమవుతున్నది? ఏమవుతున్నది? మానవుని ఏకాత్మ విశ్వరూపంగా వ్యాపిస్తే ఈ లోకంలో దరిద్రం, అజ్ఞానం, అనారోగ్యం, అసూయద్వేషాలు అంతరిస్తాయి కదా! అధికారం, నాయకత్వం, ప్రపంచాధిపత్యం కోసం సృష్టిస్తున్న అణుబాంబులు, యుద్ధోన్మాదాలు అంతరిస్తాయి కదా! మానవతా కమలాలు లక్షలు, కోట్లు, మిలియన్లుగా ఎప్పుడు విరబూస్తాయో ? !....తీక్షణంగా ఆలోచిస్తున్న సుదర్శనం బస్సు కుదుపుతో ఈ లోకంలోకి వచ్చాడు.

దిగవలసిన ఊరు రావడంతో ఆలోచనలాపుచేసి, బస్సు దిగి కాలిబాటన పడ్డాడు. ఎప్పటికి చేరుకోవాలో ఊళ్ళోకి, చీకటిగూడా పడుతోంది, తోడెవరూ లేరే అనుకుంటూ ముందుకి నడిచాడు సుదర్శనం.

(స్వర్గీయ దీనదయాళ్ ఉపాధ్యాయ స్మృతికి) ★

## విద్యార్థులు-మత్తుమందులు

ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రీసర్చి (I C M R) వారు 1977 సం.లో ఢిల్లీ, చండీగడ్, కలకత్తా, బొంబాయిలలో విశ్వవిద్యాలయాలలో చదువుతున్న బాలబాలికల ప్రవర్తనా తీరుతెన్నులమీద సర్వే జరుపగా నూటికి 20 నుండి 23 మంది బాలబాలికలు మత్తుపదార్థాలు, అల్కహాల్ సేవించడానికి అలవాటుపడ్డారని స్పష్టం అయింది. భారతావనిని తీర్చిదిద్దవలసిన భావిభారత పౌరులు భోగలాలసులై మత్తుమందులకు దాసులైపోవడం కడు విచారకరం. బాలబాలికలలో నైతిక స్థాయి పెంపొందించేటటువంటి విద్యను బోధించకపోవడమే దీనికి ప్రధాన కారణం. స్వాతంత్ర్యం వచ్చి 40 సం.లు కావస్తున్నా విద్యావిధాన స్వరూపస్వభావాలు మారకపోవడం శోచనీయం. నైతిక ఆధ్యాత్మిక శీలసంపత్తులను యినుమడింపజేసేటటువంటి విద్యను గరపడం అత్యవసరమని యిప్పటికైనా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు గ్రహించితే దేశానికి క్షేమం జరుగుతుంది.

# వసంతాన్ని సూచించే యిల




వసంత రుతువును తలచుకోగానే గుర్తుకు వచ్చేది హోలీ ఉత్సవం, ఉగాదిపచ్చడి, కోయిలగానం. మన కవుల కావ్యాల్లో హంస తరువాత కోయిల పక్షి ఎక్కువగా కనిపిస్తుంది.కోయిలగానంపై వచ్చిన గేయాలు కోకొల్లలు. ఆ విధంగా మన సంస్కృతిలో కోయిలకు ముఖ్యస్థానముంది. కోయిలను చూడక పోయినా కోయిల కూత అందరు వినేవుంటారు. కోయిల చెట్ల ఆకుల గుబురులో కూర్చుని కూస్తుంది. అందుకే మనకు కనిపించదు, కూత వెయ్యనికాలంలో కోయిల మనకుకనిపించినా పట్టించుకోం.

ప్రపంచ వ్యాప్తంగా మొత్తం 125జాతుల కోయిలలు వున్నప్పటికి భారత ఉప ఖండంలో లభించే వాటినే నిజమైన కోయిలగా గుర్తించారు. కోయిల సాధారణంగా 15 నుండి 16 సెం. మీ. పొడవున వుంటుంది. రక్తం రంగులో కనిపించే గుండ్రని కళ్ళు, చివరముందుకు ఒంగివుండే పదునైన, పొడవైన తోక కోయిల ముఖ్య లక్షణాలు.

ఆడ.మగ పక్షులకు ప్రస్ఫుటమైన తేడా వుంటుంది. మగపక్షి నల్లని మెరిసే ఈకలను కలిగివుండగా, ఆడపక్షి ఊదా రంగులో మచ్చలు కలిగి వుంటుంది. వేపచిగురు, మర్రికాయలే కాక, కీటకాలు, గొంగళి పురుగులను ఆహారంగా తీసుకుంటుంది కోయిల. కీటకాల సంతతిని పరిమితం చెయ్యటంలో కాకితోపాటు కోయిలకూడా మానవుడికి సహాయపడుతుంది.

మార్చి-ఏప్రిల్ నెలల్లో కోయిల జోడు కడుతుంది. ఆసమయంలో మాత్రమే మగపక్షి గానం చేస్తుంది. ఆ గానానికి ఆడ పక్షులు వెతుక్కుంటు వస్తాయి. గూడు నిర్మించుకోక పోవటం కోయిలప్రత్యేకత. గర్భందాల్చిన ఆడకోయిలకు నల్లని ఈకలు వస్తాయి.

గుడ్లు పెట్టేముందు కోయిల కాకులను జాగ్రత్తగా గమనించి అప్పటికే గుడ్లుపెట్టిన కాకిగూడును ఎంపిక చేసుకుంటుంది. ఆ తరువాత కాకి అవతలకు వెళ్ళగానే ఆ గూడును చేరిన కోయిల కాకి గుడ్లను బయటకు నెట్టి వేసి వాటి స్థానంలో తన గుడ్లను పెడుతుంది. కోయిల గుడ్లు కాకి గుడ్లను పోలివుంటాయి కాబట్టి కాకి వాటిని జాగ్రత్తగా పొదుగుతుంది. కోయిల పిల్లలు కాకి పిల్లల కన్నా ముందు బయటకు వస్తాయి. గుడ్లులోంచి బయటకు వచ్చిన కోయిలపిల్ల వెంటనే మిగిలివున్న గుడ్లను నెమ్మదిగా బయటకు నెట్టివేస్తుంది.

కోయిలకు ఎగిరే శక్తి వచ్చేవరకు కాకి సవతితల్లిగా సాకుతుంది. చివరకి కోయిల మోసాన్ని గుర్తించిన కాకి ఆ పిల్లలను తరుముతుంది. కాని అప్పటికే ఎగిరే శక్తి వచ్చిన కోయిలపిల్లలు ఎగిరిపోతాయి. కోయిల ఇటువంటి పద్ధతికి ఎందుకు అలవాటు పడిందీ ఇప్పటికి అర్థంకాలేదు.

— డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు



# లైఫ్ ఇన్సూరెన్సు కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

మచిలీపట్నం డివిజను

## జీవితభీమా పట్టాలపై
## యింతకు ముందెన్నడూ లేనంత

# ఎక్కువ బోనస్

లాభాలతో కూడిన



ప్రతి వెయ్యి రూపాయలకు
ఒక్కొక్క సంవత్సరానికి

| | రూ. పై. |
|---|---|
| హోల్ లైఫ్ పట్టాలపై | **65-00** |
| ఎండోమెంటు పట్టాలపై | **52-00** |

యిదికాక 15 సంవత్సరములకు పైగా అమలులోవున్న పట్టాలకు వాటి కాలపరిమితినిబట్టి వేయికి రు. 45-00 నుండి రు. 190-00 వరకూ టెర్మినల్ బోనస్ కూడా యివ్వబడుతుంది.

యిప్పుడు

* మీ సొమ్ముకు మరింత ఎక్కువ విలువ
* మీ కుటుంబానికి మరింత ఎక్కువ భద్రత

నేడే జీవితభీమా చేయండి. లాభసాటిగా రక్షణ పొందండి.

* గుర్తుంచుకోండి. **L. I. C.** భారత ప్రభుత్వ సంస్థ *

# బావా బావా పన్నీరు

"బావా బావా పన్నీరు" అనే సామెత వలన తెలుస్తోంది తెలుగునాట బావలకున్న ప్రాముఖ్యం. నిజానికి తెలుగు నాట బావ మరుదులకీ, బావా మరదళ్లకీ మధ్య ఎన్నెన్ని హాస్యాలూ, ఎన్నెన్ని సరసాలూ-వీటన్నిటికీ మధ్య ఎంతలేసి ఆపేక్షలూ. ఎంతలేసి ఆప్యాయతలూ.

చోరగుడి లక్ష్మీవసుప్రియ

జగమెరిగిన బావ మరుదులు కృష్ణార్జునులు. ఎవరైనా యిద్దరుబావమరుదులు అన్యోన్యంగావుంటే 'కృష్ణార్జునులు' అనటం పరిపాటి. ఖాండవ దహనంలో, సుభద్రా కల్యాణంలో అర్జునుడికి బాసటగా నిల్చిన కృష్ణుడు చివరికి కురుక్షేత్ర సమరంలో గూడా అర్జునుడికి రథ సారథిగా సాయపడ్డాడు. ఆ కృష్ణార్జునులే మళ్లీ గయోపాఖ్యానంలో జుట్టూ జుట్టూ పట్టుకున్నారు. చివరికి మళ్లీ కలిశారనుకోండి.

కృష్ణుడికి రుక్మి అనే మరొక బావమరిది గూడా వున్నాడట—రుక్మిణి అన్న. రుక్మిణీ కల్యాణంలో అతను కృష్ణుడి మీదకు యుద్ధానికి వస్తే ఓడించి మీసం గొరిగి పంపిస్తాడు శ్రీ కృష్ణుడు—చాలా మొరటు సరసం సుమండీ.

ఇకపోతే దుర్యోధనుడి చెల్లెలైన దుస్సల తరకు నూరుగురు బావ మరుదులు—పాండవులతో సహా నూట ఆరుగురు—చాలా పెద్ద సైన్యమే సుమండీ.

మరొక పేరు పొందిన బావ మరుదుల జంట పోతనా, శ్రీనాథుడు. శ్రీనాథుడు 'హాలికులకు కుశలమా' అంటాడు పోతనగారితో. అందుకు పోతనగారు "బాల రసాల సాల నవ పల్లవ కోమల కావ్య కన్యకన్ కూళల కిచ్చి యప్పడుపు కూడు భుజించుట కంటె హాలికులైననేమి గహనాంతర సీమల కంద మూల కౌద్దాలికులైన నేమి నిజదార సుదోదర పోషణార్థమై" అని పద్యం చదువుతాడు.

పోతనగారు పొలం దున్నుతుంటే శ్రీనాథుడు ఆ దారిన పల్లకీలో పోతుంటాడు. పోతనగారు పొలం దున్నుతున్నట్లు గమనించగానే పల్లకీ ముందున్న బోయీలను తొలగ మన్నారు. పల్లకీ నడుస్తూనే వున్నది. పోతనగారు నాగలికి కట్టి వున్న ఎద్దు ఒక దాన్ని తొలగించాడు. నాగలి దున్నుతూనే వున్నది. శ్రీనాథుడు వెనుకవున్న బోయీలను కూడ తొలగ మన్నాడు, పల్లకీ నడుస్తూనే వున్నది. పోతనగారు నాగలి కున్న రెండో ఎద్దు గూడా లేకుండా దాన్నీ తొలగించారు. నాగలి దున్నుతూనే వున్నది. అంత గొప్పగా నడిచింది ఆ బావ మరుదుల సరసం.

పోతనగారు హాలికుడు అని పరిహసించిన శ్రీనాథుడికి చివరికి తనే నాగలి పట్టవలసి వచ్చింది. కానీ ఆయనకు వ్యవసాయం అచ్చిరాలేదు. దారిద్ర్యంతో చివరికి ఆయన ఘోరమైన చావు చచ్చాడు. చివరికి విధే ఆయనతో సరసం ఆడింది.

మరొక ప్రసిద్ధి పొందిన బావ మరుదుల జంట ఇండియన్ క్రికెట్ ఆటగాళ్లు విశ్వనాధ్, సునీల్‌గవాస్కర్. ఎన్నో టెస్ట్ మాచ్‌లలో ధైర్యంగా నిల్చి ఎన్నోపరుగులు సాధించిన వీరిద్దరూ కూడా బావ మరుదులే.

శ్రీనాథుడికి పోతనగారు కాకుండా రామయ్య అనే మరొక బావమరిది వుండేవాడు. ఒక సారి శ్రీనాథుడు ఆయనతో ఎక్కడికో భోజనానికి వెళ్లాడు. రామయ్య పెద్ద పెద్ద ముద్దలు చేసుకుని తిని తేనుస్తుండగా శ్రీనాథుడు "ఏమీ మన రామయ్యా మాత్యుని భోజనపై భవమ్ము" అని పద్యం చదివేడు.

"నారద సంసారం" కథలో నారదుడు పెళ్లిచేసుకుని గృహస్థుడు అవుతాడు. ఒకసారి ఆయన్ని చూడటానికి

కృష్ణుడూ, రుక్మిణి వస్తారు. అంతలో నారదుడి బావమరిది వచ్చి "బావా" అని పిలుస్తాడు. "బావా" అని నోరారా పిలుస్తున్నాడు. మీ బావమరిదా?" అని అడుగుతుంది రుక్మిణి. "కావమ్మా! ఇక్కడ అందరూ నన్ను 'మహానుభావా' అని పిలుస్తారు వాడు అంతటి మాట అన లేక 'బావా' అని పిలుస్తాడు." అంటాడు నారదుడు. "మహానుభావులు కాస్తా ఒట్టి బావ అయిపోయినారన్న మాట" అని నవ్వుతుంది రుక్మిణి.

ఒకాయన—ఆయన బావమరిది బియ్యే పరీక్షకు వెళ్లి తప్పాడు. ఆయన భార్యా, బావమరిదీ యిద్దరూ బిక్క మొగం వేసుకుని కూచుని వున్నారు. ఇంతలో ఒకాయన పరీక్షా ఫలితాలు పడిన పేపరుతో వచ్చి "ఏమయ్యా! బియ్యే రిజల్ట్సు వచ్చినాయి. మీ బావమరిది పాస్ అయినాడా?" అని అడిగాడు. అందుకు యీయన తట పటాయించాడు. "తప్పేడు" అంటే భార్యా బావమరిదీ యిద్దరూ చిన్న బుచ్చుకుంటారు. అందుకని కాస్త నెమ్మదిగా చెప్పాడు "మా బావమరిది కాస్త నిదానం" ఇప్పుడిప్పుడే పాస్ అవ్వడులే అన్న ధోరణిలో.

ఒక పెళ్లిలో జరిగిన సంఘటన. ఆహూతులు అందరూ భోజనాలు చేసి లేవడానికి సిద్ధంగా కూచుని వున్నారు. ఇంతలో పెళ్లికూతురి తండ్రి వచ్చి "మీకు అన్నీ అందినాయా? "అని అడిగాడు. ఆయనకు దూరపు వరుసకి బావమరిది అయ్యే ఒకాయన "బ్రేవ్" మని తేన్చాడు. పెళ్లికూతురు. కవ్వి "ఆయన జవాబుగా తేన్చాడు" అన్నది. అందరూ నవ్వేశారు.

ఇక పోతే బావా మరదళ్ల హాస్యం మరి ఒక పద్ధతి. ఒకాయన—ఆయనకు చాలా మంది మరదళ్లు వున్నారు. ఒక సారి ఆయన మరదళ్లు అందరూ కూచుని మాట్లాడు కుంటున్నారు. ఆయన వాళ్ల దగ్గరికి వెళ్లి "మీ అందరికీ పెళ్లిళ్లు అయ్యేదాకా మీకు అందరికీ నేనే మొగుడ్ని" అన్నాడు. పాపం ఆ మరదళ్లు అందరూ ఏడవ లేక నవ్వారు.

ఒకసారి ఒక బావగారు పండక్కి అత్తగారింటికి వచ్చి సుష్టుగా భోజనం చేసి తేనుస్తూ మరదలితో అన్నాడుట "పర్వత శ్రేష్టి పుత్రికా పతి విరోధి, అన్న పెండ్లాము న త్తను గన్న తండ్రి. కూర్మి మీరిన నాతని పెద్ద బిడ్డ— సున్నము ఇంచుక తేగదే సుందరాంగి" అన్నాడుట. అంటే "దరిద్రపు పెద్దమ్మా సున్నంతేవే" అని.

అందుకు ఆ మరదలు "శత పద్మంబుల మిత్రుని సుతుజంపిన వాని బావ సూనుని మామన్ సతతము దాల్చెడి నాతవి సుతు వాహన వైరి వైరి సున్నంబిదిగో" అంటూ సున్నం తెచ్చి యిచ్చిందట. అంటే "కుక్కా! సున్నం ఇదుగో" అని అర్థం. చాలా వ్యాకరణ యుక్త మైన సరసం సుమండీ.

పండక్కి అత్తవారింటికి వెళ్లిన అల్లుడికి పడకకుర్చీలో కత్రతీసేసి మర్యాదచేసే మరదలుఒక్కతీ, తాంబూలంలో చింత పిక్క పెట్టి యిచ్చే మరదలు మరొకతీ - ఎన్ని రకాలో.

మునిమాణిక్యం నరసింహారావుగారు రాసిన ఒక కథలో వూళ్లో దొంగలు పడతారు. ఆయనా, ఆయన బావమరిదీ కలిసి రాత్రంతా అరుస్తారు కుక్కలలాగా దొంగలు రాకుండా. మరునాడు ఇరుగూ పొరుగూ వారు "ఎంత బాగా అరిచారండీ కుక్కలలాగా. మిమ్మల్ని విని కుక్కలు అనుకున్నాం సుమండీ. మీరు క్రితం జన్మలో కుక్కలు అయివుంటారండీ" అంటారు. ఆయనా, ఆయన బావమరిదీ యిద్దరూ పొంగిపోతారు తమ ప్రజ్ఞకి.

నిజానికి తెలుగునాట బావ మరుదులకీ, బావా మరదళ్లకీ మధ్య ఎన్నెన్ని హాస్యాలూ, ఎన్నెన్ని సరసాలూ— వీటన్నిటి మధ్య ఎంతలేసి అపేక్షలూ, ఎంతలేసి అప్యాయతలూ.



# ప్రపంచంలో అత్యధికంగా అమ్ముడయ్యే వారపత్రిక

## మనకు తెలియని ప్రపంచం

## మల్లాది వెంకటకృష్ణమూర్తి

**లండన్** నగరం నుంచి ప్రచురింపబడే వారపత్రిక 'న్యూస్ ఆఫ్ ది వరల్డ్' సర్క్యులేషన్‌లో ప్రపంచంలోనే మొదటి స్థానం ఆక్రమిస్తోంది. వారానికి 6 లక్షల 60 వేల కాపీలు అమ్ముడవుతాయి.

కారణం, నాలుగు పెన్నీలకి అమ్మబడే దీంట్లో సెక్స్‌కి, స్పోర్ట్స్‌కి ప్రాధాన్యం ఇవ్వబడుతుంది. హత్యలు, విడాకులు, అబార్షన్‌లు, అక్రమ సంబంధాలు ఇలాంటి వార్తలే ప్రచురిస్తుంది ఎక్కువగా. బ్రిటన్‌లో ప్రతి ఆదివారం వుదయం ప్రతి ఏడుగురిలో ఒకరు దీన్ని కొంటారు. పాఠకుల సంఖ్య 20 లక్షలు. ఈ పత్రికలోని హెడ్‌లైన్స్ ఈ విధంగా వుంటాయి.

"యువతీ యువకుల పార్టీలో కరెంట్ పోతే" "మిస్టర్ ఎక్స్‌కి ఓ అమ్మాయి రాసిన లేఖలు" "మరొకరి భార్యతో నాట్యం చేసిన వ్యక్తి" "ఆ అమ్మాయిల హేండ్‌బేగ్‌లలోని వస్తువులు" స్పోర్ట్స్, సెక్స్, క్రయిం తర్వాత పాఠకులని అధికంగా ఆకర్షించే శీర్షికలు మచ్చుకు కొన్ని.

"అన్ క్లయిమ్డ్ మనీ" అనే శీర్షికతో ధనికులు మరణించినా వారి ఆస్తిని పొందే హక్కుదార్లు ఆ సంగతి తెలియక దూరంగా వుంటే వారి పేర్లు ప్రచురిస్తుంది ఈ పత్రిక. ఆగస్టు 195 కల్లా ఈ శీర్షిక ద్వారా అలాంటి 11,320 హక్కుదార్లు 2 కోట్ల 20 లక్షల పౌండ్లు పొందగలిగారు, ఆ శీర్షికలో తమ పేర్లు మరణించినవారి పేర్లు కనబడటంతో.

అదేవిధంగా "మిస్సింగ్ పర్సన్స్" శీర్షిక క్రింద ప్రచురింపబడ్డ పేర్లలో 5 వేల మంది కనుక్కోబడ్డారు వుచితంగా.

ప్రతి సంచికలో 1,400 పౌండ్ల బహుమతులు గల ఫేషన్ పోటీలు, 2,800 పౌండ్ల బహుమతి గల గళ్ళ నుడికట్లు ఇవ్వబడతాయి.

136 సంవత్సరాల క్రితం ఈ పత్రిక స్థాపించబడింది. 1906నం. కల్లా 60లక్షల కాపీలు అమ్మసాగింది ఈ పత్రిక. ఆ దరిదాపుల్లో అమ్మగల పత్రిక అప్పట్లో లేదు.

ఎక్కువగా కోర్టు రికార్డుల నుంచి సెక్స్, క్రయింకి సంబంధించిన సమాచారం సేకరిస్తారు సంపాదకులు. ★

గమనిక : సెక్స్ మరియు క్రైం వార్తలపట్ల పాఠకులకు ఉన్న వ్యామోహం, సెన్సేషనల్ న్యూస్‌పట్ల ఏవిధంగా పాఠకులు ఆకర్షితులవుతున్నారో పై వారపత్రిక ఋజువు చేస్తున్నది. ఇటువంటి వాతావరణం మన దేశంలో కూడా కనిపిస్తూనే ఉన్నది. ఇది మిక్కిలి దురదృష్టకరం, ప్రమాదం కూడాను. శీలసంపత్తిని ఇనుమడింపజేసే సాహిత్య సాంస్కృతిక పత్రికలు రావాలి, వాటిని పాఠకులు ఆదరించాలి. ఆ శుభ సమయం ఎప్పుడు వస్తుందో!....

— సం.

# గార్గ్యుడు - అజాతశత్రువు

( బృహదారణ్యకోపనిషత్తు )

బాలాకుని పుత్రుడు గార్గ్యుడు మంచిమాటకారి, దురభిమాని కూడా. తనకంటే తెలిసినవాడు లేడని అహంభావం ఎక్కువైంది. ఒకనాడు అతను కాశీరాజైన అజాతశత్రువు వద్దకు వచ్చి అతనికి బ్రహ్మతత్త్వాన్ని గురించి బోధ చేస్తానని అన్నాడు.

ఆ మాట అన్నందుకే రాజు ఒక వేయి గోవులను గార్గ్యునికి బహుమతి ఇచ్చి అన్నాడు "బ్రాహ్మణకుమారా బ్రహ్మజ్ఞానులైన వారందరూ ఈ రోజుల్లో జనకమహారాజు వద్దకే పోతున్నారు. నీవు నావద్దకు వచ్చినందుకే ఆనందంగా ఉన్నది."

గార్గ్యుడు ఉపదేశం ప్రారంభించాడు -

## సి. వేదవ

"సూర్యునిలో ఉన్న ఆత్మయే బ్రహ్మం"- అన్న గార్గ్యుని మాటను త్రోసిపుచ్చాడు రాజు. "పరబ్రహ్మ స్వరూపమైన పరమసత్యమే సూర్యుడు అనటం సరికాదు!" —అన్నాడు.

"చంద్రునిలో ఉన్న ఆత్మే పరబ్రహ్మం". అన్నాడు మళ్ళీ గార్గ్యుడు. అజాతశత్రువు ఆ మాటనుకూడా ఖండించాడు బాలాకి మళ్ళీ కొన్ని ప్రతిపాదనలు చేశాడు. "ఆకాశంలోనూ, విద్యుల్లతలలోనూ, హృదయంలోనూ, గాలిలోనూ, ఊపిరిలోనూ, అగ్నిలోనూ, జలంలోనూ, దర్పణంలోనూ-ఉండేదే పరమాత్మ అయినపరబ్రహ్మం-" అన్నాడు.

అజాతశత్రువు ఈ మాటలన్నిటినీ తిరస్కరించాడు. తాను ఉపాసించే ఆ పరతత్త్వం అత్యంత శక్తిమంతమైనదని దానివల్ల మానవుడు సంతుష్టాంతరంగుడు—శక్తిసంపన్నుడు—అవుతాడని అన్నాడు.

గార్గ్యుడు వాదనలో తాను ఓడిపోతున్నట్లు తెలుసుకొన్నాడు. బ్రహ్మ పదార్థం గురించి తనకు తెలిసింది ఇంతేనని ఒప్పుకొంటూ, తనను శిష్యుడిగా స్వీకరించి ఉపదేశం చేయవలసిందిగా మహారాజును వేడుకొన్నాడు.

"బ్రాహ్మణకుమారా! ఇలా బ్రాహ్మణుడు ఆత్మజ్ఞానం కోసం క్షత్రియుణ్ణి ఆశ్రయించటం మామూలు సంప్రదాయానికి భిన్నంగా ఉంది. అయినా, అడిగావు కనుక నాకు తెలిసింది నీకు చెప్పడం నా ధర్మం."—అంటూ అజాతశత్రువు గార్గ్యునిచేయి పట్టుకుని—గాఢనిద్రలో మునిగి ఉన్న ఒక వ్యక్తి దగ్గరకు తీసుకువెళ్ళాడు. "ఓ సోమా! లే!"—అంటూ ఆ వ్యక్తిని పిలిచాడు. సోముడు పలకలేదు. అజాతశత్రువు అతడిని చేతితో తట్టి పిలువగానే అతడు నిద్రనుండి మేల్కొన్నాడు.

అప్పుడు రాజు గార్గ్యుని ప్రశ్నించాడు— "గార్గ్యా! నిద్రిస్తున్న సమయంలో మనిషి ఏమౌతాడో, ఎక్కడకు వెళతాడో తెలుసునా?". గార్గ్యుడు తనకేమి తెలియదన్నాడు.

అప్పుడు అజాతశత్రువు ఇట్లా అన్నాడు. "కుమారా! నిదురిస్తున్న వ్యక్తిలో ఉచ్ఛ్వాస నిశ్వాసాలు సాగుతూనే ఉంటవి. చైతన్యరహితంగా అతడు నిదురిస్తున్నప్పుడు కూడ అతని శరీరం సజీవంగానే ఉన్నది. అతని మనశ్శక్తులు మాత్రం హృదయాకాశంలో తాత్కాలికంగా విశ్రమిస్తాయి. స్వప్నావస్థలో మాత్రం అతడి విజ్ఞానం వివిధ పరిణామాలకు లోనుకావచ్చును. తానొక చక్రవర్తిగానో, యువకుడుగానో, బ్రాహ్మణోత్తముడిగానో స్వప్నదశలో రూపాంతరం చెందవచ్చును.

మనుష్యుడు గాఢ నిద్రలో మునిగినప్పుడు బాహ్య ప్రపంచానుభవంకానీ, స్వప్నానుభూతి కానీ అతనికి ఉండదు. నిదురలేచిన వెంటనే యథారీతి అతడివిజ్ఞానం భౌతికపరమైన కార్యకలాపాలలో నిమగ్నం అవుతుంది.

ఈ విజ్ఞానమే బ్రహ్మతత్త్వం. సాలెపురుగునుంచి లెక్కలేనన్ని దారాలు వెలువడి గూడుకట్టినట్లు, జ్వలితాగ్ని నుండి అనేకమైన విస్ఫులింగాలు చెలరేగినట్లు, ఈ విశ్వంలోని ప్రాణశక్తులు, ప్రపంచాలు, దేవతలు, సమస్తమైన వస్తుజాలం—అన్నీ ఆ పరబ్రహ్మతత్త్వం నుండే పుట్టుకు వస్తున్నవి."

అజాతశత్రువు ఇట్లా బ్రహ్మజ్ఞానాన్ని గురించి ప్రవచనం చేశాడు. గార్గ్యుడు వినయంతో ఉపదేశసారాన్ని గ్రహించి విజ్ఞానవంతుడయినాడు. 

## బాలవాణి
### సోమంచి రామం

## ఉగాది పచ్చడి



ఉగాది పచ్చడి తిందామా
యుగాల ముచ్చట విందామా ! ॥ఉ॥
చేదు చేదుగ వేపపువ్వు
పుల్లపుల్లగ లేతమామిడి
తీయ తీయని కొత్త బెల్లము
చిరుతీపి నిచ్చే చింతపండు
చక్కెరలాంటి చెరకు ముక్క
చక్కగ కలిపి ఎంచక్కగ చేసిన.... ॥ఉ॥
పాత వర్షపు భావాలే పోయి
క్రొత్త వర్షపు కోర్కెలు రాగ
దేశం కోసం త్యాగం చేసే
ఆవేశం, ఆదేశం అందించే.... ॥ఉ॥
కలిగిన కష్టాల్ మరచి
కలిగెడి సుఖాల్ తలచి
ఉద్రేకం, ఉద్వేగం అందించి
ఉత్సాహం ఉరకలు వేయించే.... ॥ఉ॥



## అమ్మ - నాన్న

*

అమ్మ మాట వింటాం...
నాన్న మాట వింటాం...
అమ్మ నాన్న మాటలు
బంగారు మూటలు...
అమ్మ పలుకులో...
అనురాగమున్నదీ
నాన్న పలుకులో...
మాధుర్యమున్నదీ...
అమ్మ ముద్దులో...
కమ్మదనమున్నదీ
నాన్న ముద్దులో
తీయదనమున్నదీ...
అమ్మ నాన్న పలుకులు
వినలేరు అందరూ
అమ్మ నాన్న ముద్దులూ
పొందలేరు కొందరూ...
అమ్మ నాన్న ఆదరం
అందుకొనే భాగ్యం
దక్కినది మాకు
అయినాము ధన్యులం....

- కొమరగిరి

# హాస్యవాణి

## నవ్వితే నవ్వండి

పద్మారావు, పద్మకుమారి పదేళ్ళ బాబుని తీసుకుని "పదండి ముందుకు" సినిమాకి వెళ్ళారు.

గేటు దగ్గర మేనేజర్ ఎదురై "ఇదసలే సీరియస్ సినిమా, మీ బాబు ఏడిస్తే ప్రేక్షకులు విసుక్కుంటారు" అన్నాడు.

"మరేం చెయ్యమంటారు! టికెట్లు కూడా కొనేసాం" అన్నాడు పద్మారావు.

"ఓపని చెయ్యండి. మీ బాబు ఎప్పుడు ఏడిస్తే అప్పుడు బయటకు వచ్చేయండి. మీ టికెట్ డబ్బులు వాపస్ ఇప్పిస్తా" అన్నాడు మేనేజర్. సరే అన్నారు పద్మారావు దంపతులు.

అరగంట సినిమా అయింది. "ఎలావుంది సినిమా" అని అడిగాడు పద్మారావు భార్యని. "మహాబోర్" అంది పద్మకుమారి.

"మరింకెందుకు నెమ్మదిగా బాబుని గిల్లు" సలహా ఇచ్చాడు పద్మారావు.

* * * *

## ప్రముఖుల హాస్యం

ప్రధాని రాజీవ్‌గాంధి ధోరణికి నిరసనగా ఇటీవలే రాజీనామా చేసిన విదేశాంగ కార్యదర్శి శ్రీ ఎ. పి. వెంకటేశ్వరన్ తండ్రి శ్రీ ఎస్.పి. అయ్యర్ ఐ. సి. ఎస్. అధికారి.

శ్రీ అయ్యర్ ఐ. సి. ఎస్. ట్రైనింగ్‌లో వుండగా శిక్షణ పొందుతున్న వారిని ఉద్దేశించి ప్రసంగించేందుకు నాటి బ్రిటన్ విదేశాంగ మంత్రి లార్డ్ బెల్ ఫోర్ వచ్చారు.

లార్డ్ బెల్‌ఫోర్ తన ప్రసంగంలో "బ్రిటన్ తన పుత్రిక అయిన భారతదేశాన్ని స్వయం పాలనకు సిద్ధం చేస్తున్నది. అందుకు ఈ ఐ. సి. ఎస్. అధికారులు సహాయ పడతారు" అని అంటుండగా శ్రీ అయ్యర్ లేచి "ఇదెక్కడి చోద్యం. తల్లి వయస్సుకన్నా కూతురి వయసు ఎక్కువ వుంటుందా! మా దేశం వయసు ఆరువేల సంవత్సరాలు పైబడివుంది...." అనేసరికి తల తిరిగిన లార్డ్ బెల్‌ఫోర్‌కి నోట మాట రాక "ఈ లెక్కన భారతదేశం ఇక ఎంతోకాలం మనచేతికింద వుండదు" అని సనుక్కున్నాడు.

## వ్యాపార ప్రకటనలు

* విజయవాడలో ఒక హోటల్ బోర్డు – దుర్గావిలాస్ మిలిటరీ బ్రాహ్మణ భోజనహోటల్.

* మంగళగిరిలో ఒక సారా దుకాణంకి పెట్టుకున్న పేరు– సర్వరోగ నివారిణి షాపు.

* మేడమీదున్న టైప్ ఇనిస్టిట్యూట్‌కి హైదరాబాద్‌లో వ్రాసిన బోర్డు – ఇచ్చట మెడ మీద టైపు చేయబడును.

–వాసు

## విజ్ఞప్తి

ఈ నెలనుండి శ్రీవాణిలో హాస్యానికి ఒకపేజీ కేటాయించ దలచాం. ఇందుకు పాఠకుల సహాయ, సహకారాలను అర్థిస్తున్నాం. "హాస్యం ఎలాగైనా వుండవచ్చు కాని కృత్రిమంగా మాత్రం వుండకూడదు. నిత్యజీవితంలో పుట్టిన హాస్యం నిలకడగా నిలుస్తుంది" – అనే సూక్తి శ్రీవాణి హాస్యానికి ప్రేరణ.

దీనిని దృష్టిలో పెట్టుకుని మీ నిత్య జీవితంలో– వీధిలోకాని, ఆఫీసులోకాని, విద్యాలయంలో కాని, మరెక్కడైనా – తారసపడిన హాస్య సంఘటనలను, మంచి మంచి జోక్‌లను, ప్రముఖుల చతురోక్తులను మాకు పంపండి. – సంపాదకుడు

# పుస్తకసమీక్ష

: సమీక్ష :

కాజ లక్ష్మీనరసింహారావు

## బ్రహ్మర్షి, గురుదత్త శ్రీశ్రీశ్రీ నారాయణస్వామి వారి జీవిత చరిత్ర మరియు పరమహంస ప్రదీపిక

రచయితలు : శ్రీ గుండెపూడి వెంకట లక్ష్మీ నరసింహమూర్తి, శ్రీ అబ్బరాజు శ్రీనివాసమూర్తి, ఎం. ఏ. బి. ఇడి. సంపాదకులు : శ్రీ పలకలూరి శివరావు వెల : అమూల్యం. ప్రాప్తిస్థానం. శ్రీ పలకలూరి బొల్లయ్య బి. ఏ. సత్యనారాయణస్వామి గుడి వీధి, పాత గుంటూరు 522010

బ్రహ్మర్షియోగానందులు, వారి అంతరంగిక శిష్యులు బ్రహ్మర్షి నారాయణస్వామి యీ గురుశిష్యుల ఆధ్యాత్మిక చింతనము, ప్రబోధములకు వెలగట్టుట ఎవ్వరికి సాధ్యము? అందుకే యీ గ్రంథము నిజముగా "అమూల్యము". ఈ గ్రంథ రచయితలు సర్వశ్రీ రాచగిరి ప్రకాశరావు, వెంకటలక్ష్మీనరసింహమూర్తి, శ్రీనివాసమూర్తి మరియు పలకలూరి శివరావు, రాయప్రోలు సుబ్బరామయ్య వీరందరు పరమేశ్వరుని ప్రమధ గణములోని వారేమో! ఈ గ్రంధ రచనా ప్రకాశన విషయమున వీరి బుద్ధి "క్షురస్యధారా నిశితా దురత్యయా" వంటిదిగా భాసించినది.

పరమహంస ప్రదీపిక. యోగానంద నృసింహ గురుదేవులకు బ్రహర్షి నారాయణ స్వామి వారికి జరిగిన సంభాషణ పూర్వకమైన ఆధ్యాత్మిక రహస్యములు, రామకృష్ణ పరమహంస-వివేకానంద యతీంద్రుల గురు శిష్య సంవాదము వలె మహోన్నతములు. ఈ గ్రంథము యోగానందమహర్షుల జ్ఞాన భాస్కరుని, నారాయణస్వామి వారి ఆధ్యాత్మిక చింతనామృత చంద్రుని వెలిగింపజేయు "ఆకాశము" వంటిదని నాకు తోచుచున్నది.

భగవంతుడెక్కడ లేడు? వ్యాసుడు పల్లె స్త్రీ కడుపున, వాల్మీకి కిరాతకులమున పుట్టలేదా ? వారు భగవదవతారములు కారా ? నారాయణస్వామి నాయీ బ్రాహ్మణుడుగా అవతరించి లౌకికముగా ఆ కులమును, ఆధ్యాత్మికముగా లోకమును ఉద్ధరించిరి. విశేషమెచ్చటనున్నదనగా మన మతమున అన్నికులములు గొప్పవే. దేని విశిష్టత దానికున్నది. మహాజ్ఞానియై, దైవభక్తి, సచ్ఛీలముగలవాడు శూద్రుడైనను నమస్కరింపదగిన వాడని మన మతము బోధించుచుండగా దానిని ఎట్లు కాదన గలము? నారాయణ స్వామివారి పుట్టుక, వైరాగ్య భావన. కఠోరతపస్సు వారి అనంత మహిమలు, వారి వేదాంత బోధనలు, వారి సర్వజీవితము లోకాదర్శము. వారి దర్శనము కలి కల్మష హరణము.

నారాయణ స్వామి జీవితచరిత్రమును కళాశాలస్థాయి విద్యార్థులకు పఠనీయగ్రంథముగా విశ్వవిద్యాలయమువారు నిర్ణయింపవలయును. ఇది మన జాతియువతకు అద్భుతమైన ప్రేరణ కల్పింపగల రచన. ఈ గ్రంథమున సందర్భోచితముగా ఉదాహరింపబడిన శ్లోకములు, వాని వివరణలు, సాక్షాత్తు గురువే చెప్పుచున్నట్లున్నది. ఇందుకు రెండు కారణములు 1) గ్రంధమునందలి విషయవైశిష్ట్యము 2) గ్రంథకర్తలకు భాషపై గల అధికారము. వీరి శైలి ద్రాక్షరసమును వడబోసినట్లున్నది. పరమ స్వచ్ఛముగానున్నది. ఇది వచన రచన. నిజమైన వచన రూపకవిత. కావ్యగత విషయతాదాత్మ్యము లేనిచో ఇట్టి శైలి కుదరదు. శ్రీ స్వామివారు అస్ఖలితబ్రహ్మచారులు, సర్వసంగపరిత్యాగులు, భగవత్సాక్షాత్కారము నొందిన ఋషులు. ఇట్టి మహనీయులు భారత దేశమున ఆయా కాలములలో, ఆయా ప్రాంతములలో అవతరించుచునే యున్నారు. మతము, ఆధ్యాత్మిక విషయములలో ప్రపంచమునకు భారతదేశమే తల్లి. కబీరు, తుకారాం, నారాయణగురు, నారాయణస్వామి వారలను వెనకబడిన కులములకు చెందిన వారని అనుట యెంత అనుచితము? ఈ మహనీయులు ఏ విదేశముననో పుట్టినచో, ఒకొక్కరు ఒకొక్కమతమును స్థాపించి యుండెడివారు. కాని యిది భారత దేశము, మన స్వామివారు బ్రహ్మర్షులు అంతే. ★

## వీరశివాజీ

( 16వ పేజీ తరువాయి )

మీదకు వెళ్లతాడు శివాజీ ఆరాధ్య దేవత అయిన తుల్జాపూర్‌లో నున్న భవానీ విగ్రహాన్ని ధ్వంసం చేస్తాడు వేలాది గోవులను నరికి వేస్తాడు. దేవాలయాలను పడగొడుతాడు. స్త్రీలను చెరచడం, గ్రామాలను తగుల పెట్టడం బ్రాహ్మలను హింసించడం చేస్తాడు. ఈ దురంతాలను గురించి ప్రజలు వెళ్లి శివాజీకి మొరపెట్టుకుంటారు. అరణ్యాలలోని కోటలలో వున్నంతకాలం శివాజీని ఎవరూ జయించలేరనే విషయం అఫజల్‌ఖాన్‌కు బాగా తెలుసు. అందువల్లనే శివాజీని మైదాన ప్రదేశాలకు రప్పించాలనే తలంపుతోనే ఖాన్ ఈ హింసాకాండకు దిగాడు. అయితే శివాజీ తొందరపడలేదు. సమయం కోసం కాచుకుని కూర్చున్నాడు. అప్పుడు తనకున్న శక్తితో అఫజల్ ఖాన్‌తో తలపడితే శివాజీ ఓడటం ఖాయం. ఖాన్ మాయోపాయాన్ని శివాజీ గ్రహించాడు. ప్రజల మొరను లెక్క చేయలేదు. తాత్కాలిక ప్రయోజనం కన్నా శాశ్వత ప్రయోజనం ముఖ్యమని శివాజీ భావించాడు. సమయం కోసం కాచుకొని కూర్చున్నాడు. అరణ్యాలలో నున్న "ప్రతాపగఢ్" కోట సరైనదని భావించి, సైన్యంతో అక్కడికి చేరాడు. ఖాన్ ఎంతదూరం ముందుకుపోయినా శివాజీ ఎదురురాకపోవటంచేత, మాయోపాయంచే వంచించాలని ఖాన్ భావిస్తాడు. అఫజల్‌ఖాన్ ఒక రాయబారిని పంపిస్తాడు. ఆ రాయబారి శివాజీని కలిసి "అఫజల్ ఖాన్ మీ నాన్నగారికి మంచి స్నేహితుడు. నీకు ఏహానీ చేయదలచలేదు. నీతో కూడా స్నేహాన్ని కోరుతున్నాడు. కనుక దుర్గం దిగివచ్చి ఖాన్‌ను కలుసుకోండి" అని మృదుమధురమైన మాటలతో ఆ రాయబారి శివాజీకి నచ్చచెప్పడానికి ప్రయత్నిస్తాడు. శివాజీ కూడా ఒక ఉత్తరం వ్రాసి తన ప్రతినిధిని అఫజల్‌ఖాన్ వద్దకు పంపుతాడు. "నీవు నాకు పినతండ్రి లాంటివాడివి. నా తప్పులను మన్నించి ప్రతాపగఢ్ కోటకు వచ్చి నన్ను బీజాపూర్ సుల్తాన్ వద్దకు తీసుకొనిపోండి." అని శివాజీ వినయపూర్వకంగా వ్రాసిన లేఖను చదివి ఖాన్ మురిసిపోతాడు. శివాజీ లొంగివచ్చాడని భావిస్తాడు. ఆ లేఖను తీసుకుని వెళ్లిన ప్రతినిధి ఖాన్ గొప్పతనాన్ని పొగడుతాడు. శివాజీ పిరికిపందని వర్ణిస్తాడు. ఆ పొగడ్తకు ఖాన్ తన్మయత్వం చెందుతాడు. తన సైన్యంతో జావలి అడవులలో నున్న ప్రతాప్‌గఢ్ కోటవద్దకు చేరుతాడు. ప్రతాపగఢ్ కోట దగ్గరనే ఇరువురూ స్నేహితులలా ముచ్చటించుకోవడానికి నిర్ణయించుకుంటారు. ఆ చర్చలలో అంగరక్షకులు ఎవరూ ఉండరాదని శివాజీ కోరుతాడు. శివాజీ భయపడుతున్నాడని ఖాన్ భావిస్తాడు. అఫజల్ ఖాన్ ముందు శివాజీ శారీరకంగా చూస్తే అతి బలహీనుడు. ఒంటరిగా వచ్చిన శివాజీని తన బాహుబలంతో నలిపివేయగలనని ఖాన్ భావిస్తాడు. శివాజీ, ఖాన్‌ల సమావేశానికి ముందు రాత్రే నేతాజీ, తానాజీ కన్హోజీ మొదలగు నమ్మకస్థులైన సేనానులు తమ సైన్యంతో కోట దిగి అడవులలో కాపుగాస్తారు. శివాజీ నుండి సంకేతం రావడంతోనే శత్రుసైన్యంమీద విరుచుకపడటానికి సిద్ధంగా ఉంటారు. శివాజీ శివుణ్ణి భవానీ మాతను ప్రార్థించి ఉక్కు టోపిని, ఉక్కు కోటును, పులిగోళ్ళను చిన్న కత్తిని ధరించి అఫజల్‌ఖాన్‌ను కలుసుకోవడానికి కోట దిగుతాడు. షామియానా ద్వారంలో వేచియున్న అఫజల్‌ఖాన్ శివాజీని చూడగానే ముందుకు నాలుగడుగులు వేసి తన బలమైన బాహువులతో శివాజీని ఆలింగనం చేసుకొని నలిపివేయాలని భావిస్తాడు. శివాజీ కూడా ఖాన్ మాయోపాయాన్ని ముందుగానే గ్రహిస్తాడు. ఎప్పుడైతే శివాజీని కౌగలించుకొని తన కత్తితో వీపుమీద పోటు పొడవగా, శివాజీ ఉక్కు కోటుమీద కత్తి తగిలి ప్రతిధ్వనిస్తుంది. వెంటనే శివాజీ తన ఉక్కు గోళ్ళతో అఫజల్‌ఖాన్ పొట్టను చీల్చి ప్రేగులను బయటకు లాగుతాడు. అరె! అల్లా! అంటూ ఏడడుగుల అఫజల్‌ఖాన్ నేల కొరుగుతాడు తన కత్తితో ఖాన్ తలను శివాజీ నరికివేస్తాడు. శివాజీ ఒంటరిగా ఖాన్ డుడారంలోనికి వెళ్లటం చూచి ఖాన్ సైన్యం ఆనందోల్లాసములలో మునిగిపోయింది. ఖాన్ లాంటి బలాఢ్యుని ముందు శివాజీ ఎంత? అని వారి

అభిప్రాయం. ఈపాటికే శివాజీ పరలోక యాత్రకు పయనమై ఉంటాడని ఖాన్ సైన్యం కేరింతలు కొడుతూ ఉంటుంది. ఇది అదును చూసుకొని వెనుకనుండి శివాజీ సైన్యం హఠాత్తుగా ఖాన్ సైన్యం మీదపడి చెల్లాచెదరు చేస్తారు. చావగా మిగిలినవారు పలాయనం చిత్తగిస్తారు. శివాజీ విజయ దుందుభులను మ్రోగిస్తాడు. తన తల్లి జిజియాబాయికి ఖాన్ తలను బహుమానంగా పంపిస్తాడు.

## బాజీప్రభు దేశపాండే

అఫజల్‌ఖాన్ మరణవార్త సర్వత్రా వ్యాపిస్తుంది. బిజాపూర్ సుల్తాన్ హడలిపోతాడు. శివాజీ చాలా జాగరూకతతో వ్యవహరించి యింకా అనేక కోటలను స్వాధీనం చేసుకుంటాడు. మరల 70 వేల సైన్యమును యిచ్చి 'పన్హాల్‌గడ్' కోటను ముట్టడించడానికి 'సిద్ది జౌహర్' ను బిజాపూర్ సుల్తానే పంపిస్తాడు. ఇంగ్లీషువారు కూడా శివాజీని పట్టుకోవడానికి సహకారం అందిస్తారు. బిజాపూర్ సుల్తాన్ కోరికపై ఢిల్లీ పాదుషా కూడా నూరు వేల సైన్యమును యిచ్చి 'షైస్తఖాన్' ను యిచ్చి పంపుతాడు. ఇంత సైన్యమును ఎదిరించి పోరాడటం అంత తేలికకాదని శివాజీ భావిస్తాడు. అటువంటి సంకట పరిస్థితిలో శివాజీ తల్లి జిజీయాబాయి ప్రభుత్వ యంత్రాంగాన్ని తన చేతులలోనికి తీసుకొని పరిపాలన కొనసాగిస్తుంటుంది. శివాజీ ఒక ఉపాయాన్ని ఆలోచించి, తాను పూర్తిగా లొంగిపోయానని, క్షమించమని ఒక లేఖను 'సిద్దిజౌహర్' కు వ్రాస్తాడు. ఈ వార్త విని మొగలు సైనికులు ఆనందోల్లాసాలలో త్రాగి తన్మయత్వంలో వళ్ళు మైమరచి పడిపోయివుంటారు. అర్ధరాత్రి భారీ వర్షం కూడా కురుస్తుంటుంది. ఇదే సరైన సమయమని శివాజీ తన 800 మంది సైనికులతో కోట దిగి 'విశాలగఢ్' వైపుకు పయనిస్తారు. మొగలు సైనికులు మైకంలో దీనిని గుర్తించరు. అయితే ఒక మొగలు గూఢచారి మాత్రం దీనిని పసికట్టి 'సిద్దిజౌహర్' కు తెలియపరుస్తాడు. తన అల్లుడు "సిద్దిమసూద్" ను కొంత సైన్యంయిచ్చి శివాజీని వెంబడించి పట్టుకోమని పురమాయిస్తాడు. శివాజీ దీనిని గ్రహించి, తన సైన్యంలో శివాజీ ఆకారంగల ఒకతనికి తన వేషం వేయించి, తాను కొంతమందిని తీసుకొని మరొకవైపుకు దారితీస్తాడు. వేషం వేసిన అతనే అసలు శివాజీ అని 'సిద్దిమసూద్' భావించి అతనిని పట్టుకొని సిద్ది జౌహర్ వద్దకు తీసుకొని వెళ్లతారు. అతను అసలు శివాజీకాదని, ఒక మంగలి వాడని గ్రహించి సిగ్గుపడతారు. ఇది తెలుసుకొని 'సిద్దిమసూద్' మరల కొంత సైన్యమును తీసుకొని అసలు శివాజీని వెంబడిస్తాడు. ఈ లోపలే శివాజీ అతి వేగంతో 25 మైళ్ళ ప్రయాణం చేసి "గజాపూర్" కనుమ వద్దకు చేరుకుంటాడు. అతను చేరవలసిన "విశాలగఢ్" కోట యింకా కొన్ని మైళ్ల దూరంలో ఉంటుంది. "సిద్దిమసూద్" 5 వేల సైన్యంతో వెంబడిస్తూంటాడు. శివాజీవద్ద కొన్ని వందల సైన్యము మాత్రమే వుంటుంది. ఎదురుపడితే ఓడిపోవడం ఖాయం. ఇది గ్రహించిన శివాజీ మరొక ఉపాయం ఆలోచిస్తాడు. శివాజీసైన్యంలో భీముడిలాంటి వ్యక్తి ఒకడుంటాడు. అతనిపేరు "బాజీప్రభుదేశపాండె" అతనికి కొంత సైన్యం యిచ్చి ఆ కనుమ వద్ద కాపలా కాచి సిద్దిమసూద్ సైన్యమును అక్కడే అటకాయించమని చెబుతాడు. మిగిలిన సైన్యంతో "విశాలగఢ్" కోట వైపుకు శివాజి ప్రయాణిస్తాడు. ఆ సన్నటి కనుమ వద్ద "బాజీప్రభు" కాపలా కాచి పఠాను సైనికులను కుప్పలు కుప్పలుగా నరికి పారేస్తాడు. భీకరసంగ్రామం జరుగుతుంది. ఉన్నకొద్దిమందితోనే ధైర్యంగా ఎదిరించి పోరాడుతూ శత్రుసైన్యాలను ఒక అడుగు కూడా ముందుకు వేయకుండా నిరోధిస్తాడు. శత్రుసైన్యం వేలలో ఉంటుంది తన సైనికులు కొద్దిమంది మాత్రమే. వేలమంది శత్రు సైనికులను తుదముట్టిస్తాడు. తన వద్దవున్న కొద్దిమంది సైనికులు కూడా వీరమరణంపొందుతారు. ఒక్కడే అయిన వృట్టికి స్వైర విహారం చేస్తాడు బాజీప్రభు కత్తిధాటికి ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేక పోతారు పఠాన్ సైనికులు. శరీరమంతా తూట్లుపడి రక్తం ప్రవహిస్తూ వుంటుంది. అయినప్పటికి ధైర్యాన్ని కోల్పోక

పోరాడుతూ వఠానుసైనికులను ఖండిస్తూ సాయంత్రం వరకు ముందుకు రానివ్వకుండా నిరోధించగలుగుతాడు. దురదృష్టవశాత్తు ఒక కత్తి వచ్చి దూసుకొని పోతుంది. అదే సమయంలో శివాజి " విశాలగఢ్ " చేరినట్లు సంకేతం వినబడుతుంది. ఆనందంతో మనశ్శాంతితో " బాజి ప్రభు " కన్నుమూస్తాడు. చరిత్ర పుటాలలో " బాజి ప్రభు " చిరస్థాయిగా నిలచిపోతాడు. ఆనాడు అతను తన ప్రభువు శివాజిని రక్షించడానికోసం అతను చేసిన త్యాగం చూపిన ధైర్య సాహసాలు అసామాన్య మైనవి. ఆ భీకర సంగ్రామం జరిగిన ఆ కనుమ, ఆ నాటినుంచి " పావన్ ఖింది " గా ప్రసిద్ధి గాంచింది.

## షైస్తఖాన్

వేలాదిమంది సైనికులు ముట్టడించినప్పటికీ, ధైర్యం కోల్పోక ఉపాయంతో 800 మంది సైనికులతో ఆ విషమ వలయం నుండి తప్పించుకోవడం చూచి బిజాపూర్ సుల్తాన్ ఆశ్చర్యపడిపోతాడు. మరల ఎప్పుడూ శివాజీని ఎదిరించాలనే ఆలోచన చేయడు. అయితే షైస్తఖాన్ బెడదను ఎదుర్కొనవలసి వస్తుంది శివాజీకి. నూరువేల సైన్యంతో వచ్చి పూనాలో తిష్ఠవేసుకొని అవకాశంకోసం ఎదురుచూస్తూ వుంటాడు షైస్తఖాన్. రంజాన్ రోజున షైస్తఖాన్ పని పట్టాలనుకొని శివాజీ ఒక పథకమును తయారు చేసుకుంటాడు. ఎందువలనంటే రంజాన్ నెలరోజులు మహమ్మదీయులు ఉపవాసంవుండి రాత్రి మస్తుగాతిని గాఢనిద్రలో మునిగిపోతారు. అంతేకాదు. ఆ రోజు ఔరంగజేబ్ నెలకొల్పిన మొగలాయిసామ్రాజ్య వార్షికోత్సవదినం కూడా కావడం వలన మొగలాయి సైనికులు విందులుచేసికొని తప్పత్రాగి వళ్లు మైమరచి చిందులువేసేదినం అది. అదే సరైన సమయమని శివాజీ భావిస్తాడు. బాబాజి అనే ఒక బాల్య స్నేహితునితో కలిసి పథకం వేస్తాడు, బాబాజి కొంతమంది సైనికులకు మారు వేషాలు వేయించి చప్పట్లు కొడుతూ బిగ్గరగా అరుస్తూ మొగల్ స్థావరంలోనికి వెళ్లుతాడు. కొంత సైన్యంతో మారువేషాలలో శివాజీ కూడా అతనివి అనుసరిస్తాడు. కావలాదారులు "బాబాజీ"ని అటకాయించగా "మేము ఖాన్ సైనికులమే. శత్రువుల ఆచూకీని గమనించడానికి బయటకు వెళ్లి వస్తున్నాం" అనిచెప్పి లోపలప్రవేసిస్తారు. శివాజీ సైనికులు కూడా లోపల ప్రవేశించి వంటగదిలోనికి వెళ్ళుతారు. అక్కడవున్న కొద్దిమంది సైనికులను సంహరిస్తారు. షైస్తఖాన్ నిద్రపోతున్న పాలెస్‌కు చేరుకుంటారు, అక్కడ అడ్డంగావున్న ఒక గోడను పడగొడుతారు. ఒక మొగల్ సేవకుడు దీనిని గమనించి గాఢ నిద్రలో నున్న ఖాన్ వద్దకు వెళ్లి పెద్దగా చెబుతాడు. గాఢనిద్రలో మునిగివున్న ఖాన్ వీడి మొరను వినిపించుకోక వంటగదిలో ఏదో ఒక ఎలుక ప్రవేశించివుంటుందిలే అని చెప్పి మరల నిద్రలో మునిగిపోతాడు. శివాజీ తన అనుచరులతో అంతఃపురంలోనికి చేరుకుంటాడు. నిద్రపోతున్న ఖాన్ మీదికి కత్తి విసరుతాడు. ఖాన్ మూడు వేళ్లు తెగి కిందపడుతాయి. ఖాన్ కిటికీ నుంచి క్రిందకు దూకుతాడు. మొగల్ సైన్యం శత్రువుల జాడను గ్రహించి లాల్‌మహల్‌ను చుట్టుముట్టి శత్రువులకోసం గాలిస్తూ వుంటుంది. మారువేషాలలో మన్న శివాజీ తన అనుచరులతో పెద్దగా అరుస్తూ, చప్పట్లు కొడుతూ "శత్రువులను పట్టుకోండి ! బంధించండి !" అంటూ లాల్‌మహల్ తలుపులు తెరచి బయటకు పారిపోయి, గుర్రాలు ఎక్కి "సింహగఢ్" చేరుతారు. ఈ సంఘటనను వినిన ఔరంగజేబు ఆశ్చర్యపోతాడు. శివాజీ కేవలం కొండ ఎలుక కాదు, అది ఒక పిశాచమని, అతనిలో మానవాతీత శక్తులు కూడా వున్నాయని భయపడిపోతాడు.

## జయసింహ

శివాజీ అభివృద్ధిచేస్తున్న ఈ మహాసామ్రాజ్యాన్ని పరిపాలించడానికి నిధులు కావాలి. ఎక్కడనుంచి వస్తుంది ? ఆనాడు పెద్ద సామ్రాజ్యాధినేత ఔరంగజేబ్. అతనివద్ద కావల్సినంత నిధి ఉన్నది. దానినే కొల్లగొట్టి సంపాదించాలని శివాజీ నిర్ణయించుకున్నాడు. ఆ రోజులలో సూరత్ పట్టణంలో నిధులు మూలుగుతున్నాయి. సూరత్ మీద దాడి సలిపి ధనాగారాన్ని స్వాధీనం చేసు

కుంటాడు. దీంతో ఔరంగజేబు శివాజీని బంధించకపోతే తన అస్తిత్వానికే ప్రమాదం ఏర్పడవచ్చునని భావించాడు. ఈ సింహాన్ని బంధించడానికి మరొక సింహాన్ని రెచ్చ కొట్టాడు. అతనిపేరే ' జయసింహ '. అతను మహా మేధావే కాదు, రాజకీయ చతురుడు. అంతేకాదు అనుభవం గల మహా సేనాని కూడాను. అటువంటి హిందూ సేనాని మొగలు ప్రభువులకు బానిస కావడం నిజంగా దురదృష్టకరం. మనం మన స్వాతంత్ర్యాన్ని కోల్పోవడానికి ప్రముఖ కారణం మన బలహీనతే. మన వీరులే స్వార్థంతో విదేశీయులకు పాదాక్రాంతులవ్వడం వలనవే మనం స్వాతంత్ర్యాన్ని కోల్పోయాం. జయసింహ పెద్ద సైన్యంతో దక్షిణాదికి బయలుదేరాడు. బీజాపూర్ సుల్తాన్‌ను ఓడించాడు. శివాజీ మీదకు దాడి చేయడానికి సిద్ధమయ్యాడు. ఈ ఆపదను గ్రహించిన శివాజీ లొంగిపోతున్నానని ప్రకటిస్తూ, ఢిల్లీ పాదుషాకు శాశ్వతంగా నమ్మకంగల సామంతుడుగా వుండటానికి అంగీకరిస్తున్నానని ' జయసింహ 'కు ఒక లేఖ వ్రాశాడు.

తన కుమారుడు శంభాజీతో కలిసి శివాజీ ఆగ్రా కోటకు ఔరంగజేబును కలవడానికి వెళ్లుతాడు. అక్కడే ఔరంగజేబును మాయోపాయంగా హతమార్చాలని పథకం వేసుకుంటాడు. ఔరంగజేబు కూడా సామాన్యుడు కాదు గదా! దర్బారుహాలులో దూరంగా శివాజీని వుంచటానికి ఔరంగజేబు ఏర్పాటు చేస్తాడు. శివాజీ నిరుత్సాహ పడతాడు ఇవ్వవలసినంత మర్యాద యివ్వలేక పోవడం వలనే ఆ దర్బారునుండి అసమ్మతి సూచకంగా శివాజీ నిష్క్రమిస్తాడు. ఔరంగజేబు శివాజీని బంధించమని ఆజ్ఞ జారీ చేయగా శివాజీని, శంభాజీని బంధించి జైల్లో వేడతారు. జైలులో శివాజీ జబ్బు చేసినట్లుగా నటిస్తాడు. తనతో పాటు నిర్బంధించబడిన మారాఠా సైనికులను విడుదల చేయమని ఔరంగజేబుని ప్రార్థిస్తాడు. వారిని విడుదల చేస్తారు. శివాజీ, శంభాజీ జైలోనే వుంటారు. మందులవలన జబ్బు నయం కాదని, ఫకీర్లకు లడ్డూలు పంచిపెడితే నయమవుతుందని చక్రవర్తికి నచ్చచెబుతాడు. దానికి చక్రవర్తి అంగీకరిస్తాడు. ప్రతిరోజు కొన్ని పెద్దపెద్ద గంపల లడ్డూలు పట్టణంలోనున్నవారికి జైలు నుండి పంపబడుతూ వుంటాయి. ఒక రోజున వచ్చిన గంపలలో శివాజీ, శంభాజీలు కూర్చుంటారు. పైన లడ్డూలు పేరుస్తారు. ప్రతిరోజూ వెళ్లే లడ్డూల గంపలే గదా యని బయటకు పంపడానికి కాపలాదారులు అంగీకరిస్తారు. శివాజీ, శంభాజీ ఆ విధంగా బయటపడి, అక్కడ సిద్ధంగా వున్న గుర్రాలనెక్కి మారువేషాలతో సమర్థరామదాస్ నిర్మించిన సత్రాలలో విశ్రాంతిని తీసుకుంటూ ' రాయగఢ్ 'కు చేరుకుంటారు. మొగలు సైనికులు జైలును పరీక్షించి శివాజీ పారిపోయాడని తెల్సుకొని సిగ్గుతో తలలు వంచుకుంటారు. ఔరంగజేబు సహితం మోసపోయినందుకు విచారిస్తాడు.

## ఛత్రపతి

1630 వ సంవత్సరంలో జన్మించిన శివాజీ తన 44 సం॥ లో అనగా 1674 లో బంగారు సింహాసనాన్ని అలంకరిస్తాడు. ప్రముఖ పండితుడు గాగభట్ట బంగారపు గొడుగును పట్టుకుంటాడు. శివాజీ గురువు సమర్థరామదాసు దగ్గర వుండి కార్యక్రమాన్ని నిర్వహిస్తాడు. వేదమంత్రాలతో శివాజీ హిందూ సామ్రాజ్య అధినేతగా చక్రవర్తి పదవిని స్వీకరిస్తాడు. అప్పటినుంచే ఛత్రపతి శివాజీగా అందరిలో పిలువబడతాడు, ఆ సుదినమే హిందూసామ్రాజ్య దినోత్సవంగా ఆనాటినుంచి మనం చేసుకుంటున్నాం. 1680 లో శివాజీ పరమపదిస్తాడు.

## పరిపాలనా దక్షుడు

కేవలం యుద్ధ నైపుణ్యాన్ని ప్రదర్శించే సైన్యాధిపతిగానే కాక పరిపాలనా దక్షుడుగా కూడా శివాజీ పేరు ప్రఖ్యాతుల నందుకున్నాడు. దక్షిణాన మైసూరు వరకు వ్యాపించిన్న తన సామ్రాజ్యమును పటిష్ఠంగా పాలించేందుకు

( తరువాయి 52వ పేజీలో )

( 3వ పేజీ తరువాయి )

## ప్రశాంతినిలయంలో... తొమ్మిదిరోజులు

పుస్తకమును గురించి చర్చించాను. క్రొత్తవారు సహితం బాబాగారిని గురించి తెలుసుకోవడానికి ఇంకా వివరణ ఆ పుస్తకంలో యిచ్చివుంచినట్లయితే బాగుండేదని చెప్పాను. బాబాగారు ప్రేమతో భక్తులకు యిచ్చిన కానుకలు transmiters గా ఉపయోగపడగల శక్తి గలిగి వుంటాయని డా॥ రావుగారు ఆ పుస్తకంలో పేర్కొనినారు. దానిమీద కూడా కొంత చర్చ వారితో జరిగింది. ఆ శక్తి వుంటుందని మాత్రం అంగీకరించాను.

అయితే అనుభవంలో ఆ అనుభూతిని నేను మాత్రం పొంది వుండలేదు. (జూలైలో నాకు శివలింగం, నవంబరులో ఉంగరం బాబాగారు నాకు యిచ్చారు.) డా॥ రావుగారితో మాట్లాడిన తరువాత నా గదికి వెళ్లాను. నా గదిలో నేను ఒక్కడినే ఉన్నాను గదా! నా ఆందోళనను బాబాగారు యిచ్చిన నా ఉంగరంతో చెప్పుకున్నాను. "బాబా! నా 30 సంవత్సరాల బంధాలను, అనుబంధాలను త్రెంచివేసుకొని నీ సాన్నిధ్యానికి చేరాను. నా గమ్యమేమిటో నాకు తెలియటం లేదు. నేను ఎటు పోతున్నానో నాకు అర్థం కావడంలేదు. నాకు మరొకరెవరూ దిక్కులేరు. నిన్నే నమ్ముకున్నాను, నీ సన్నిధి కి చేరాను. రెండురోజులుండమన్నావ్. ఇది నాలుగోరోజు. నన్ను చూస్తావ్! నవ్వుతావ్! వెళ్ళిపోతావ్! నా ఘోష, నా వేదన, ఆవేదన, నా అభ్యర్థన నీకు వినిపిస్తే, నన్ను ఈ రోజు పిలుస్తావ్!" అంటూ అప్రయత్నంగా నా నోటి నుండి వచ్చిన ఈ క్రింది కవితను చదివాను.

"గతం నాస్తి, భవిష్యతా సూన్యం
వర్తమానం అంధకారం
పయనమెచటికో బాటసారి
నీ పయనమెచటకో బాటసారి.
గమ్యమేమో తెలియరాదు
బాట యేమో కానరాదు
ఎంతకాలం ఈ ప్రయాణం
ఇంకెంతకాలం అంధకారం"

అని చదివి ఏడ్చేశాను. ముఖం కడుక్కొని భోజనం చేయడానికి క్యాంటిన్‌కెళ్ళాను. భోజనం చేసి బజారుకు వెళ్ళి వార్తాపత్రిక కొనుక్కొని, ప్రాంతీయ వార్తలు విని మరల గదికి చేరుకున్నాను. గదికి వచ్చి దినపత్రిక చదివిన తరువాత సంతోషించాను. "బాబా! నేను ఈనాడు ఎంతో సంతోషిస్తున్నాను బాబా! 30 సంవత్సరాల తరువాత ఒక మంచి నిర్ణయాన్ని (రాజకీయాలలో పాల్గొనరాదని) తీసుకొనేందుకు అవసరమైన ప్రేరణను, శక్తి సామర్థ్యాలను కలుగజేసినందుకు నిజంగా సంతోషిస్తున్నాను బాబా! నన్ను పిలిచినా పిలవకపోయినా ఫరవాలేదు. వెళ్లమనేంతవరకు ఇక్కడనే ఉంటాను బాబా!" అని నా ఉంగరం ముందు చెప్పుకున్నాను. పుస్తకం చదువుతూనే నిద్రపోయాను. 4 గంటలకు లేచి బట్టలు వేసుకొని క్యాంటిన్ వద్దకు వెళ్ళి టీ త్రాగి మరల భక్తుల వరుసలో కూర్చున్నాను. బాబాగారు వస్తూనే నన్ను పిలిచారు. ఆనందంతో లేచి నమస్కరించి ఇంటర్వ్యూ గది ముందుకు వెళ్ళి వరండాలో కూర్చున్నాను. బాబాగారు నా వద్దకు వచ్చి "ఏయి! వేదాంతి లోపలికి రా!" అని అన్నారు. (అంతకు పూర్వం వేదాంత ధోరణిలోనే నా గదిలో మాట్లాడుకున్నానుగదా?) నాతో సహా 7 గురు పురుషులు, 5 గురు స్త్రీలు వచ్చారు. అందులో ఐ. ఏ. యస్ అధికారులు, వారి కుటుంబాలు మరియు శ్రీ కుప్పా బైరాగి శాస్త్రిగారు వారి అర్థాంగి కూడా వచ్చారు. అది ఇంటర్వ్యూ కాదు. అది ఒక ఆధ్యాత్మిక శిక్షణా తరగతి అంటే బాగుంటుంది. బాబాగారు అనేక విషయాలు బోధించారు. దేశ రాజకీయాలను ప్రస్తావించారు. వ్యక్తిగత, జాతీయ శీలముల ఆవశ్యకతను గురించి వివరించారు. నిర్భయంగా చెడును ఎదిరించడం, మంచిని ప్రోత్సహించడం అధికారుల విధ్యుక్త ధర్మమని చెప్పారు. ద్రౌపదీ వస్త్రాపహరణ అప్పుడు, అన్నీ తెలిసిన భీష్మ, ద్రోణాదులు సత్యం పలుకకుండా, నోరు మూసుకొని ప్రేక్షకులవలె వ్యవహరించడం వలననే, చివరికి అట్టివారు కూడా శిక్షను

అనుభవించవలసి వచ్చిందని పేర్కొన్నారు. విద్యార్థులను తీర్చి దిద్దడానికి అవసరమైన నీతివిద్య (Moral Education) ను పాఠశాలలో బోధించడం లేదని, వారిని సచ్ఛీల వంతులుగా తీర్చిదిద్దడానికి ప్రయత్నాలు జరగడం లేదని చెబుతూ, నేడు విద్యార్థి సంఘ ఎన్నికలు జనరల్ ఎన్నికల స్థాయిలో జరుగుతూ డబ్బు విచ్చలవిడిగా ఖర్చు చేయడం మిక్కిలి దురదృష్టకరమని, పవిత్రమైనవిద్యాలయాలలో ఈ ఎన్నికల పద్ధతికి స్వస్తిచెప్పాలన్నారు. పసిహృదయాలలో Unity లుప్తమై Enimity ప్రబలడం భవిష్యత్తులో అత్యంత ప్రమాదకరమని చెప్పారు. Unity వున్నపుడే Purity వస్తుందని, Purity వున్నప్పుడే Divinity ని సాధించవచ్చునని బోధించారు. నేటి విద్యావంతులలో చాలామందిలో జ్ఞానం లుప్తమవుతున్నదని చెపుతూ విద్యతోపాటు వివేకజ్ఞానం, విచక్షణా జ్ఞానం, లౌకిక జ్ఞానం అనుభవ జ్ఞానములను కూడా సంపాదించినప్పుడే సరైన జ్ఞానమును సంపాదించడం అవుతుందని వివరించారు. "జ్ఞాతుం ద్రష్టుం చ తత్వేన ప్రవేష్టుం చ పరన్తప" అనే వాక్యం-సాధకుని పారమార్థిక వికాసాన్ని చక్కగా చిత్రిస్తుందని చక్కగా వివరించారు. నేను ఆ రోజు మధ్యాహ్నం నవంబరు నెలలో బాబాగారు ప్రసాదించిన ఉంగరమును చేతిలో పట్టుకొని నా గదిలో వేదాంత ధోరణిలో మాట్లాడుకొనిన అన్ని విషయాలను పూసగుచ్చినట్లుగా సమాధానం చెప్పి నన్ను ఆశ్చర్యచకితులను గావించడం ఆనాటి ఇంటర్వ్యూలోని ప్రత్యేకత, బాబాగారు ప్రేమతో యిచ్చిన వస్తువులు తప్పనిసరిగా భక్తుల మనోభిప్రాయాలను తెలియపరచుటకు transmiters గా ఉపయోగపడుతాయనే అనుభవం నేను ఆనాడు అనుభవించాను. భక్తుడు ఆర్తితో పిలిచినప్పుడు, అనన్య భక్తితో మొరపెట్టుకున్నప్పుడు భగవంతునికి వినపడుతుందనే నగ్న సత్యమును నేను ఆ రోజున అనుభవించాను, అనుభూతిని పొందాను. మరల ఆ రోజున కూడ బాబాగారు నాకు విభూతి ప్రసాదం యివ్వలేదు. "నీవు యింకా ఉండాలి" అని మాత్రం ఆదేశించారు. నా జీవితంలో ఆనాడు అనుభవించిన ఆనందం మరెన్నడూ పొందివుండలేదేమో !

అది 17 వ తేది సాయంత్రం. భక్తులు పారవశ్యంలో సంకీర్తన చేస్తున్న సమయం అది. బాబాగారు అడుగులో అడుగు వేసుకుంటూ ప్రశాంత వదనంతో చిరునవ్వును చిందిస్తూ ముందుకు సాగిపోతున్నారు. భక్తులు లేఖలను చేతులలో పట్టుకొని బాబాగారు స్వీకరిస్తారేమోనని ఆతురతతో నిరీక్షిస్తున్నారు. బాబాగారు ఏ ఒక్క కవరును స్వీకరించకుండా ముందుకు నడచిపోతున్నారు. కొందరు భక్తులు తన్మయత్వంలో సంకీర్తనలో మునిగిపోయారు. మరి కొందరు బాబాగారిని చూస్తూ ఆనందాన్ని అనుభవిస్తున్నారు. నేను కూడా బాబాగారి ముఖమును తదేక దృష్టితో చూస్తూ తన్మయత్వాన్ని చెందుతున్నాను. బాబాగారు సరాసరి వచ్చి నా ముందు నిలుచున్నారు. ఒక క్షణం నిలబడి "కృష్ణమోహనరావ్ ! రేపు ఉదయం పిలుస్తానులే ! రేపు మధ్యాహ్నం నీవు వెళ్ళవచ్చు." అని చెప్పి సరాసరి మందిరం లోనికి వెళ్లిపోయారు. ఈ ఒక్క విషయం చెప్పడానికే బాబాగారు ప్రత్యేకంగా బయటకు వచ్చినందుకు బాధపడ్డాను, ఆనందించాను. బాబాగారికి భక్తుల యెడల గల ప్రేమ, వాత్సల్యం ఎటువంటిదో ఈ సంఘటన నిరూపిస్తున్నది. ఈ చిన్న మాటను చెప్పడానికి బాబాగారు మందిరం నుండి రానవసరంలేదు, అయినప్పటికీ వచ్చారు. భక్తులను ఎంత శ్రద్ధతో గమనిస్తుంటారో నాకు ఆనాడు అర్థమయింది. ఆ సంఘటన నన్ను కదిలించి వేసింది. అప్రయత్నంగా నా కనుల వెంబడి కన్నీరు కారింది. నా హృదయం లోనే వారికి కృతజ్ఞతలు చెప్పుకున్నాను.

అది 18 వ తేది ఉదయం. గం. 7-15 ని. బాబాగారు బయటకు వచ్చారు భక్తులలో కొంతమందిని ఇంటర్వ్యూకు రమ్మనమని ఆదేశిస్తూ, నావద్దకు వచ్చి నన్నూ రమ్మనమని చేయి ఊపారు. ఆనందంతో వెళ్లాను. ఆరోజు ఇంటర్వ్యూలో స్త్రీలు 10 మంది. పురుషులు 7గురు. ఒక చిన్నపాప. ఆ చిన్నపాపకు

అన్నప్రాశన చేసి ఒక లాకెట్ గొలుసు మెళ్లో వేసి దీవించారు. ఒక దీక్షరోగికి కృష్ణ విగ్రహాన్ని సృష్టించి ఇచ్చారు. నావైపు చూచారు. దగ్గరకు రమ్మనమన్నారు. 'ఒక్క నిముషంకూడా వృధా చేయకు. అందువలన నీకు Watch యిస్తున్నాను, అనీఅనడంతోనే బాబాగారి చేతిలో Watch ప్రత్యక్షమైంది. దానిని నా చేతికి తగిలించారు. "శ్రీవాణిని శ్రద్ధగా నడుపు"అని ఆదేశించారు. ఆ తరువాత భక్తులను విడివిడిగా మరొక గదిలోనికి పిలిచి ఏవో విషయాలు చెప్పి పంపుతూవున్నారు. ఆఖరికి నన్ను ఒక్కడినే పిలిచారు. ఏ విధముగా బాబాగారికి కృతజ్ఞతలు తెలియపరచాలో నాకు బోధపడక, వారి పాదపద్మాలమీద తలను పెట్టి ఏడ్చాను. "నీవు అనవసరంగా ఆలోచించి బుర్రను పాడుచేసుకుంటున్నావ్. అప్పుడు నీ మనసు stand still అవుతున్నది. మంచిగా ఆలోచించినప్పుడు నీవు బాగా వ్రాయగలవు." అన్నారు అప్పుడు నేను "శ్రీవాణి'ని చదువుతున్నారా ? బాబా ! " అన్నాను " నేను మొత్తం చూస్తునే ఉన్నాను. శ్రీవాణిని పక్షపత్రిక చేద్దాం. సమయం చెబుతానులే, " అన్నారు బాబాగారు. ఇంకా అనేక విషయాలను అడుగుదామనుకున్నాను. కాని మాటరాలేదు. అయినప్పటికీ నా మనసులో నున్న సందేహాలను, నేను అడుగకుండానే వారే నివృత్తిచేసారు. కొంతకాలం రాజకీయాలకు దూరంగా వుండటం మంచిదని చెబుతూ, శ్రీవాణి ద్వారా సమాజ సేవ చేయమని ఆదేశించారు. ఊహించని రీతిలో యింకా అనేక విషయాలను చెప్పి ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించే సలహాలనిచ్చి పంపారు. 18 వ తేది మధ్యాహ్నం వెళ్ళమని అనుమతినిచ్చారు. విభూతి ప్రసాదం యిచ్చి దీవించి పంపారు. 18 వ తేది మధ్యాహ్నం బయలుదేరి ఎన్నికలు అయిన మరునాడు అనగా 19 వ తేదీన బందరు చేరాను. ఎన్నికలు పూర్తి అయ్యేంతవరకు ప్రశాంతి నిలయంలోనే ఉంచాలని బాబాగారి ఆకాంక్షేమో !

ప్రశాంతి నిలయం వెళ్ళటం ఇది నాల్గవ సారి. ఈ తొమ్మిది రోజులలో మూడు పర్యాయములు (12, 16, 18 తేదీలు ) బాబాగారు నాకు ప్రత్యేకమైన ఇంటర్వ్యూలు నిచ్చి ఎన్నో అమూల్యమైన విషయాలను చెప్పి దీవించి పంపారు. ఇటువంటి సదవకాశం సామాన్యంగా అందరికి లభించదని అక్కడి పెద్దలు ఎందరో చెప్పారు. బాబా అనుగ్రహాన్ని సంపాదించడం అంత తేలిక కాదనే విషయం యావన్మందికి తెలిసినదే. సాక్షాత్ భగవంతుని అనుగ్రహానికి పాత్రుడనైనందుకు నేనెంతో సంతోషిస్తున్నాను. ఆ అర్హతను భవిష్యత్తులో కూడా నిలుపుకోనేందుకు అవసరమైన శక్తిసామర్థ్యాలనుకూడా ప్రసాదించమని వారినే అర్థిస్తున్నాను, ప్రార్థిస్తున్నాను. నా ప్రవర్తనను Watch చేయడానికే నాకు Watch యిచ్చి వుంటారని నేను భావిస్తున్నాను. ఏదైనా ఉత్తమ ఆదర్శాన్ని సాధించడానికి అకుంఠిత దీక్ష కావాలి. శీల సంపత్తిని యినుమడింప జేసుకోవాలి. సత్ప్రవర్తన కలిగి వుండాలి. మిత్రులచేత ప్రశంసలను పొందడములో గొప్పతనంలేదు. శత్రువులచేత సహితం ప్రశంసలనందుకోవడం లోనే ఉన్నది గొప్పతనం. ఒక్క సచ్ఛీల సంపన్నులు మాత్రమే అందరిచేత మెప్పును పొందగలుగుతారు. కనుక అటువంటి సచ్ఛీలమును రక్షించుకోవడానికి ఎల్లప్పుడూ అప్రమత్తంగా ఉండాలి. అప్రమత్తతతో జీవితాన్ని గడపడానికి నాకు Watch వి యిచ్చారని నేను భావిస్తున్నాను. Watch అనే ఇంగ్లీషు పదానికి బాబాగారు ఏనాడో చక్కటి నిర్వచనం యిచ్చారు. దానినే ' పంచాక్షరి " గా భావించుకొని మననం చేసుకుంటూ ప్రవర్తనను కాపాడుకోమని చెప్పారు. ఈ పదంలో శీలాన్ని కాపాడుకునే విలువలు ఎన్నో ఉన్నాయి.

"W" అనే అక్షరం WORDS (మాటలు) అనే పదానికి సంకేతం

"A" అనే అక్షరం ACTIONS ( చేతలు ) అనే మాటకు ప్రతినిధి

"T" అనే అక్షరం THOUGHTS (ఆలోచనలు) కు ప్రతీక

"C" అనే అక్షరం CHARACTER (శీలము) ను తెలుపుతుంది.

"H" అనే అక్షరం HEART (హృదయము) ను సూచిస్తుంది.

కాలు జారుతే తీసుకోవచ్చునుగాని, నోరుజారితే తీసుకోలేం. మాటలకు, చేతలకు ఆలోచనలే మూలం. ఆలోచనలు పవిత్రంగా, స్వార్థరహితంగా, పదిమందికీ ప్రయోజనకరంగా, విశ్వశ్రేయో రూపంగా ఉంటే, మాటలూ, చేతలూ వాటిననుసరిస్తాయి. శీలములేని మనిషి చిల్లికుండతో సమానమని, శీలము జీవిత పుష్పానికి సుగంధం వంటిదని, మనస్సు నిర్మలంగా వుంచేనే మానవశీలం ఉదాత్తంగా వెలుగొందుతుందని బాబాగారు చెప్పారు.

" మనసులో నున్న భావంబు మంచిదైన
కలిగి తీరును ఫలసిద్ధి కార్యమందు
మనసులోనున్న భావంబు మలినమైన
ఫలము గూడ నా రీతిగా మలినమగును "

అని బాబాగారు యిచ్చిన సందేశమును ప్రతి ఒక్కరూ స్మరించినప్పుడు, మననం చేసుకున్నప్పుడు దుష్ట భావములు, దుష్టచింతనలు వాటంతట అవే దూరమై పోతాయి. కనుక ప్రతి ఒక్కరూ తన ప్రవర్తనను WATCH చేసుకుంటూ జీవన ప్రయాణం కొనసాగించాలి.

WATCH YOUR WORDS
WATCH YOUR ACTIONS
WATCH YOUR THOUGHTS
WATCH YOUR CHARACTER
WATCH YOUR HEART

ఇదే బాబాగారు భక్తులకు ప్రసాదించిన " పంచాక్షరి " దీనిని అనుక్షణం స్మరిస్తూ, జపిస్తూ ఆచరించేవారు మోక్షమును పొందడానికి అర్హతను సంపాదించుకోగలుగు తారు. మంచిపేరును సంపాదించుకుంటారు. అందరిచేత మెప్పును పొందుతారు.

— కొమరగిరి కృష్ణమోహనరావు

## వీర శివాజీ (48వ పేజీ తరువాయి)

వీలుగా అనేక కోటలను నిర్మిస్తాడు. సలహాల నిచ్చేందుకు " అష్టప్రధానులు " అని పిలువబడే ఎనమండుగురితో మంత్రిమండలిని ఏర్పర్చుకున్నాడు. అంటరాని తనమును నిర్మూలించడానికి అనేక సంస్కరణలను తీసుకొని, విద్యావిషయంలో ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకొని సంస్కృతాన్ని పోషించాడు. అవినీతి పరులకు, దేశద్రోహులకు కఠిన శిక్షలను విధించాడు. బంధుప్రీతిని చూపించేవాడు కాదు. ప్రభుత్వ యంత్రాంగానికి సరిపడ మేరకే పన్నులు వసూలు చేసేవాడు. సామాన్య వ్యక్తిపై పన్నుల భారం పడగూడదని భావించేవాడు. జమీందారీ వ్యవస్థను నిరసించాడు. శివాజీని కొంతమంది చరిత్ర కారులు, ముఖ్యంగా విదేశీయులు అవకాశవాదిగా చిత్రించారు. " కొండ ఎలుక " అని అభియోగం చేశారు. ఇది వాస్తవం కాదు. శివాజీ గొప్ప రాజనీతిజ్ఞుడు. సమయస్ఫూర్తితో, ఉపాయంతో అనేక కోటలను, రక్త పాతం జరుగకుండా, సునాయాసంగా ఆక్రమించు కున్నాడు. బలమైన శత్రు సైన్యాలను, వీరాధివీరులైన సేనాధిపతులను, సుల్తానులను తన చాకచక్యంతో పట్టిలు కొట్టించాడు. సమయస్ఫూర్తిని ప్రదర్శించకుండా, మూర్ఖంగా మొగలాయి ప్రభువులను శివాజీ ఎదిరించి ఉన్నట్లయితే అగ్నిలోపడ్డ మిడతవలె దగ్ధమై పోయుండే వాడు. భూషణకవి వ్రాసినట్లుగా హిందువులందరూ మహమ్మదీయులైపోయి, మన సనాతన సంస్కృతీ ధర్మాలు సర్వనాశనం అయిపోయి వుండేవి. రాజకీయ చతురుడు, పరిపాలనాదక్షుడు శివాజీ. నేటి పరిపాలకులు శివాజీనుండి తెలుసుకోవలసిన విషయాలెన్నో ఉన్నాయి. శివాజీ ఒక్క మహారాష్ట్రకు మాత్రమే నాయకుడు కాదు. యావత్ భారతావనికి స్ఫూర్తి ప్రదాత. ఆ మహనీయుని స్మరించి, అనుసరించడం ప్రతి పౌరుని కర్తవ్యం. ★

# 'శ్రీవాణి' జీవిత సభ్యులు



**Dr. K. V. CHARY**
CHANDRAPUR
Maharastra



శ్రీ యాద అచ్చయ్య
కోదాడ, నల్లగొండ జిల్లా



**Sri R. Venkateswara Rao**
Timber Commission Agent
BALLARPUR, Maharastra



శ్రీ చందోలు భాస్కరరావు
కోదాడ, నల్లగొండ జిల్లా



**Sri K. V. Rama Rao**
Timber Commission Agent
BALLARPUR, Maharastra



శ్రీ అక్కిరాజు
మధుసూదనరావు
కోదాడ, నల్లగొండ జిల్లా



**Sri A.V.L. Narasimha Rao**
Timber Commission Agent
BALLARPUR, Maharastra



**Sri M. N. Meera Swamy**
Timber Commission Agent
BALLARPUR, Maharastra

శ్రీ ఉప్పులూరి
వెంకట
కృష్ణమోహనరావు
Ex. కర్ణం, విజయవాడ

Postal Registered
No. H/MPM/34, Dt. 10-12-84



శ భా కాం క్ష ల తో

